# స్వప్నానసూయ.

ఆకొండి రామమూర్తి.

శ్రీరామా.

# పీఠిక.

---

వంగదేశమున 'కవిరాజు' అనఁగ—కవితాప్రజ్ఞాసమన్వితుఁ డనియే కాక వైద్యశిఖామణి యనునర్థముగూడ నున్నది. కాని మనకట్టి యర్థము లేనట్లున్నది.

అట్టి 'ఉభయథా' కవిరాజగు నాయన యీగ్రంథమును వ్రాసినవారు. ఈయన వైద్యప్రతిభయే యత్యుత్తమమైనది. అంతకన్న నత్యుత్తమమైన కవితాప్రతిభ యీయనకున్నదనుట కీగ్రంథమే సాక్షి. వీరి వైద్యప్రతిభావిశేషములనుగూర్చి చందురిన కొకనూలుపోగను చందముగా, శ్రీ పాలంకి సూర్యనారాయణగారు రచించిన వైద్యగ్రంథమున కుపోద్ఘాతమును వ్రాయుచు నందు వ్రాసికొనియున్నాను. ఈప్రాంతములందు చెన్నపట్టణ వారెంతప్రజ్ఞానిధులో నావైపున వీరట్టివారు. నా కుమారులలో నొకనికిఁ గల్గిన భయంకరవ్యాధిని నిర్మూలించి వీరు నాకు పుత్రభిక్ష మిచ్చినపుణ్యాత్ములు. అట్టివారి వైద్యవిద్యానవద్యత నిచ్చట తిరిగి వ్రాయుట యనావశ్యకము. శ్రీ సూర్యనారాయణగారి గ్రంథములోని నాయుపోద్ఘాతము నెవ్వరో విమర్శించినట్లు నాకెవ్వరో చెప్పినారు. కాని ఆవిమర్శనుగూర్చి యిచట వ్రాయుట యంతకన్న ననావశ్యకము.

ఆత్రేయసగోత్రులైన శ్రీ ఆకొండి రామమూర్తిగారీ స్వప్నానసూయాకృతికర్తలు. అత్రిమహాముని యర్ధాంగలక్ష్మి యగు అనసూయాచరిత్రమును వ్రాయుట కాత్రేయసగోత్రులే తగినవారుకదా! ఈకవిశిఖామణి దేవీభాగవతములోని నవమస్కంధము నాంధ్రీకరించి విఖ్యాతికెక్కెననఁగా దేవీభాగవతములోని నవమస్కంధమువక్క తక్కుఁగల స్కంధము లాంధ్రీకరించిన బాలసరస్వత్యాది బిరుదాంకితులగు తిరుపతివేంకటకవులలో నొక్కరగు శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు,

శా. ఆయుర్వేదము రామమూర్తి విరహాయాసంబు సైరించి తా
నీయుర్విన్ మఱియొక్కవిన్ వలవ దంచేనాఁడిటిన్ మున్నుతత్
శ్రీయెల్లంధ్రువమయ్యె నేఁ డతని రక్షింపంగదే షష్టిపై
నాయుర్దాయమిఁకొక్క షష్టినిడి సౌఖ్యంబిమ్ము మృత్యుంజయా!

అని రామమూర్తిగారి వైద్యప్రతిభ నుగ్గడించియున్నారు.

శ్రీ ఆకొండి రామమూర్తిగారు తాము రచించిన 'స్వప్నానసూయా' గ్రంథమును పిఠాపురము వచ్చినప్పుడు నాకాదరపూర్వకముగా నిచ్చిరి. దాని నప్పుడే స్థాలీపులాకన్యాయముగాఁ జూచి యాముద్దులమూటగట్టు గ్రంథమునకు 'తమ సెలవగునెడల నుపోద్ఘాతమును వ్రాయుదు' నని వారితో మనవిచేసితిని. అందుపై వారు 'మీపరేంగితజ్ఞానమునకు సంతసించితి' నని యనుచుఁ బీఠికను వ్రాయుటకు నాకనుమతియిచ్చిరి.

పాలకొల్లులోని వైశ్యరాజరత్నమగు శ్రీశ్రీ చుండూరి నారాయణరావుగారు శ్రీ రామమూర్తిగారి యింటికిఁ జనుదెంచి సమ్మదాశ్రుపూరితనయనయుగళుఁడై,

క. ప్రతిపదరమణీయము రం
జిత కమనీయార్థగుణవిశేషము భవద
ద్భుతకవితాగుంఫనమో
కృతమతి! నీవెట్టి పరమకృతకృత్యుఁడవో!

గీ. రసమయంబైన భవదీయ రమ్యకావ్య
సృష్టి సామర్థ్యమేను వర్ణింపఁజాలు
శక్తిగలవాఁడఁగాను నిశ్చయము నీకు
సాటి యెవ్వరు? కవిలోకచక్రవర్తి!

ఉ.
నాకొక వాంఛపుట్టెను మనంబున దాని ఘటించి సత్కవీం
ద్రా! కృతకృత్యుఁ జేయవలెనన్నుభవత్కృతికార్యనైపుణిన్.

వ. అది యెద్దియందువేని.

సీ. అనసూయ యనుపేరనన్వర్థనామయై
యనుపమప్రణయభావార్ద్ర యగుచు
నన్ను నిస్తుల మహానందాబ్ధి నోలార్చి
నిజసద్గుణముల నన్నియల నాదు
హృదయాంతరాళంబు నెల్ల నుజ్జ్వలితంబు
గాఁజేసి మెలఁగి యొక్కసుతఁ బడసి

మత్పూర్వ జన్మకర్మవశంబునం గాల
గర్భమం దడఁగె మత్కాంత; యట్టి

సీ. నాదుప్రియధర్మపత్ని తన్నామధేయ
మిచట శాశ్వతముగ నిల్వ నెద్దియేని
యొక్క సత్కృతిఁ జేయింప నుల్లమందుఁ
గలిగె నాకొక్క సుదృఢసంకల్పమార్య!

ఉ. భూజనమాననీయ నిజపుణ్యవిశేషముచేతఁ గీర్తికిన్
భాజనమై కవిత్వరస భావసమృద్ధులకోజమైన నీ
యోజ కవీంద్రునే యడుగు టొప్పగుఁగా కొరువేఁడనేల ని
ర్వ్యాజమనోజ్ఞభవ్యహృదయా! దయఁ దత్కృతిఁ గూర్చి
యీఁగదే!

క. రాజాస్థానులఁ బెక్కుటఁ
బూజింపఁగబడితి వైద్యమునఁ గవితను వి
భ్రాజితగతి నీయట్టి సు
ధీజననుతుచేతనేఁ గృతిం గొనరాదే?

అని వీరినిఁ బ్రార్థించుటఁజేసి వీరీకృతిని వ్రాసి శ్రీనారాయణ రావుగారి కర్పించిరి.

కృతి రచింపఁబూని వీరొక్క నిరుపహతిస్థలంబున విశ్రమించి నిమీలితలోచనులై యాలోచనైకాయత్తచిత్తులై యుండుటయు నాసమయంబున నిద్దురపట్టుటయు, ఆనిదురయందలి స్వప్నమం దిర్వురు పుణ్యసతులు గన్పడుటయు జరిగినది. స్వప్న

మున-ఆపుణ్యసతు లిర్వురకు జరిగిన సంభాషణమునే కవిగారు కృతిగా రచించిరి. ఆపుణ్యసతులలో నొకరు శ్రీనారాయణరావు గారి ధర్మపత్నియగు అనసూయామాతరుణి. మఱొకరు అత్రిమహాముని ధర్మపత్నియగు అనసూయాదేవి. అందుచే నీకృతికిఁ గృతికర్తలు “స్వప్నానసూయ” అను నామముంచినట్లు కనఁబడుచున్నది.

క. ఈమనసంభాషణములు
నామహిమమువలన ధాత్రి నవకావ్యరస
శ్రీమెఱయుచున్నయవి కాం
తామణి! ... ... ...

అని యత్రిపత్నియగు అనసూయ యనుటచే నీకృతికి ‘స్వప్నానసూయ’ అను నామ ముంపఁబడినట్లుకూడ నూహింపవచ్చును.

అత్యుత్తమకవితాశక్తిగల శ్రీరామమూర్తిగారి కవితాధార నాస్వాదింపవలసినదేకాని వ్రాయ నలవికాదు. అయినను వీరి కవితాశైలికై కొన్ని పద్యముల నుదహరించెదను. పైనుదాహరించిన పద్యములనుబట్టి వీరి కవితాశక్తి వెల్లడియగుచునే యున్నది. ఇంకను నాకుఁ దోఁచినపద్యముల నుదహరించెదను. ప్రథమాశ్వాసమున-వార్ధక్యతారుణ్యములను వర్ణించుచు వ్రాసిన పద్యమును జూడుఁడు.

సీ. వృద్ధతాపసి గట్టె విలసిల్లు చెంగావి
పడుచు ధరించె మేల్పట్టుచీర
యోగిని మెడలోన నొప్పె రుద్రాక్షలు
తరుణి కంఠమున రత్నములు మెఱసె
ముదుసలి యొడలిపై ముడుతలు గాన్పించె
యువతి దేహము పుష్టి నొప్పియుండె
జరఠ పచ్చని మేనిచాయ భాసిలుచుండె
జవ్వని చామనచాయఁ దనరె
గీ. పెద్దయొదువయది శతవృద్ధయట్టు
లరయఁగా నయ్యె; నజ్జవరాలు నిరువ
దేండ్లప్రాయంబుగలయట్టు లెసఁగుచుండెఁ
బూర్ణసౌభాగ్యలక్ష్మి యిర్వురకుఁ దగియె.

ద్వితీయాశ్వాసమునఁ బతివ్రతలను వర్ణించుచు వ్రాసిన పద్యమును తిలకింపుఁడు.

చ. గురుహితవృత్తలై ప్రియులకుం బ్రియలై నిజధర్మనిష్ఠను
స్థిరలయి పుణ్యకార్యములచే శుభశీలసమృద్ధిచే గుణో
త్తరలగు నిట్టి సత్సతులు దక్క మఱొక్కరు త్రొక్కనేర రీ
పరమపదంబు శాశ్వతశుభప్రచురప్రమదంబుఁ బుత్రికా!

ప్రతివిషయమున నీపద్యమున కీపద్యమేసాటి.

ద్వితీయాశ్వాసమున నారాయణరాయపత్ని యత్రిమహర్షి పత్ని నెఱిఁగి.

క. ఓవిశ్వప్రథితమహా
పావనచారిత్రి! సుప్రభావజలనిధీ!
నీవేనా యనసూయా
దేవివి మాతల్లి! సాధ్వీమతల్లీ!

అని వినుతించిన పద్యమెంతయో సహజముగా నున్నది. మఱొకపద్యము.

క. పూతవు, నిఖిలవ్రతసు
స్నాతవు, రక్షితసమస్తజగతీజనసం
ఘాతవు, లోకాతీతవు
మాతల్లీ! నిను నుతింప మాతరమగునే?

ఈపద్యమును జదువుచుండఁగాఁ బోతరాజుగారు మనకు జ్ఞప్తికివచ్చెదరు కాదా!

తృతీయాశ్వాసమున సీతామహాదేవి పాతివ్రత్యప్రభావమును వర్ణించుచు వ్రాసినపద్యము నవలోకింపుఁడు.

సీ. అద్దాలమేడ కొంకకపల్కు నాడింపలేదయ్యెఁ
బ్రాజ్యదైతేయసామ్రాజ్యలక్ష్మి
కనుఁగొననైనఁ గన్గొనఁ జేయలేదయ్యె
భువనరమ్యమగుపుష్పకంబు
మాఱుమొగంబేని మరలింపలేదయ్యె
గంభీరదశకంఠగౌరవంబు

ఒకపాటి తల్లనైన నూహింపలేదయ్యొ
నతిరాదరితరచంద్రహాసధార

గీ. యద్దిరా! నిర్భరప్రణయప్రఫుల్ల
రామచంద్రపదాంభోజరాగభరిత
చరితయగు సీత సౌశీల్యసద్గుణప్ర
తాపమహితపతివ్రతాత్వప్రశస్తి!

చతుర్థాశ్వాసమున నిద్రవోయిన బాలరూపత్రిమూర్తులను వర్ణించిన పద్యమును తిలకింపుఁడు.

క. నిండినబొజ్జలతోఁ గను
పండువుగాఁ బవ్వళించి, పరదేవతలై
యుండెడు నప్పసిపాప ల
ఖండ సుఖాత్ములయి నిదురఁ గని రచ్చోటన్.

ఇట్లెన్నియేనిఁ జెప్పవచ్చును. గ్రంథకర్తగారి కనేక నమస్కారము లర్పించుచు నింతటితో విరమింతును.

ఆ. వె. పంచదారకంటెఁ బరిపక్వమైనట్టి
తీయద్రాక్షకంటెఁ దేనెకంటె
సుధలవానకంటె మధురతరంబయి
ముద్దులొలుకు రామమూర్తి కవిత.

పిఠాపురము.
4-1-1937.

పానుగంటి లక్ష్మీనరసింహరావు.

శ్రీరస్తు.

# స్వప్నానసూయ.

## ప్రథమాశ్వాసము.

శ్రీకరమై యనాదియయి
చిత్రవిచిత్ర విశేష నిత్య శో
భాకరమై తనర్చు భువ
నాద్భుత సృష్టికి మూలభూతులే
కాక నిరంతర ప్రకృతి
కల్పిత సర్వ నిజప్రియప్రజా
నీకము సాఁక నేరిచిన
నిక్కపుఁ దల్లియుఁ దండ్రి యెవ్వరో! 1

శా. ఔరా! యట్టి పురాణ దంపతుల గా
ఢాన్యోన్య రాగాతి గం
భీరోదారతరాంతరాత్మల దృఢ
ప్రేమాను బంధంబు లే

తీరై యొప్పెడివో గదే యనుచు నెం
తే నాత్మ భావించుచున్
శ్రీ రమ్యంబులు సృష్టి చిత్రములు నేఁ
జింతించుకొంచు న్మదిన్. 2

చ. ఎవి యెవియో తలంపు లెటు
లెట్టులో యుద్భవమంది యంతలో
నవి యొకదాని వెంట నొకఁ
డట్టులె మాఱుచు వింత వింతగా
వివిధ విచిత్రభంగులఁ బ్ర
వృద్ధములై యిదమిత్థ మంచుఁ జె
ప్ప వలనుగాక యొప్ప నొక
భావ పరంపరలోన నుండఁగన్. 3

తే. నాఁడు ననుఁ జూడ నొక సుగుణప్రశస్తుఁ
డంచితౌదార్య పరితోషితార్యుఁ డర్య
వంశవర్ధనుఁ డఖిలార్థి వాంఛితార్థ
దాన నిరతుండు విమల చేతస్కుఁ డతఁడు. 4

సీ. నా యల్లునకు సత్యనారాయణాఖ్య భి
షగ్రత్నమున కిష్ట సఖుఁడు, నాకుఁ

దనుస్మాల విరచితోత్తమ పూర్వ పరిచయుం

డై యున్నవాఁడు తా నధిక భక్తి

తాత్పర్యవశత మత్సదనంబునకు వేడ్కఁ

జనుదెంచి కృత నమస్కార ముఖ్య

సముచితాచారుఁడై సంలబ్ధ బహుశుభా

శీర్వాద నిచయుండు స్వీకృతాతి

గీ. థేయ సత్కారుఁడును నయి తీయ మెసఁగఁ

గొంతతడ విష్టసల్లాపగోష్ఠి నడపి

సాదరత, మద్విరచిత పద్యములు కొన్ని

యాలకించి ప్రవృద్ధ మోదాత్ముఁ డగుచు. 5

గీ. భక్తియు మదీయ కవితానురక్తియు నిజ

మానసమునుండి యుప్పొంగి మహితభంగి

వెల్లివిరియంగ సంతోషవివశుఁ డగుచు

నిట్టులనె సమ్మదాశ్రువు లుట్టిపడఁగ. 6

క. ప్రతిపదరమణీయము రం

జితకమనీయార్థగుణవిశేషము భవద

ద్భుత కవితా గుంఫనమో

కృతమతి ! నీవెట్టి పరమ కృతకృత్యుఁడవో! 7

గీ. రసమయంబైన భవదీయ రమ్యకావ్య
సృష్టిసామర్థ్య మేను వర్ణింపఁజాలు
శక్తిగలవాఁడఁగాను నిశ్చయము నీకు
సాటి యెవ్వరు? కవిలోకచక్రవర్తి!

ఉ. నీ కవితారసామృతము
నే నిపు డెంతయు వేడ్కఁగ్రోలి మో
హైకవశాంతరాత్మకుఁడ
నై యలరారుచు నుండ నింతలో
నా కొక వాంఛ పుట్టెను మ
నంబున దాని ఘటించి సత్కవీం
ద్రా! కృతకృత్యుఁ జేయవలె
నన్ను భవత్కృతి కార్యనైపుణిన్.

వ. అది యెద్ది యందువేని,

సీ. అనసూయ యనుపేర నన్వర్థనాముడై
యనుపమప్రణయ భావార్ద్రియగుచు
నన్ను నిస్తుల మహానందాబ్ధి నోలార్చి
నిజసద్గుణముల వన్నియల నాదు
హృదయాంతరాళంబు నెల్ల నుజ్జ్వలితంబు
గాఁ జేసి మెలఁగి యొక్కసుతఁ బడసి

మత్పూర్వజన్మ కర్మనశంబునం గాల
గర్భమం దడఁగె మత్కాంత; యట్టి
గీ. నాదు ప్రియధర్మపత్ని తన్నామధేయ
మిచట శాశ్వతముగ నిల్వ నెద్దియేని
యొక్క సత్కృతిఁ జేయింప నుల్లమందుఁ
గలిగె నా కొక్క సుదృఢసంకల్ప మార్య! 11

ఉ. భూజన మాననీయ నిజ
పుణ్యవిశేషముచేతఁ గీర్తికిన్
భాజనమై కవిత్వరస
భావసమృద్ధుల కోజ మైన నీ
యోజకపీంద్రమనే యడుగు
టొప్పగుఁగా కొరు వేఁడ నేల ని
ర్వ్యాజ మనోజ్ఞ భవ్యహృద
యా! దయఁ దత్కృతిఁ గూర్చి యీఁగదే!

క. రాజాస్థానులఁ బెక్కిటఁ
బూజింపఁగఁబడితి వైద్యమునఁ గవితను వి
భ్రాజితగతి నీయట్టి సు
ధీజననుతుచేత నేఁ గృతిం గొనరాదే? 13

ఉ. ఏమును రాజబంధువుల
మే చుమి ! యుత్తమవైశ్య భూపతి
గ్రామణి మాదుమాను యిది
గాక మదీయులు నిత్యసంపదు
ద్దాములు కాన నెంతయు ము
దంబున నొక్కకృతిన్ గ్రహింప, ని
న్నే మెయి సత్కరింపఁ బర
మేశు కృపం దగియున్న వారమే. 14

ఆ. నీరచించు కృతి యుదారభావంబులఁ
దెలుఁగునాట వెలయు స్త్రీలకెల్ల
నుచిత ధర్మ సమితి నుగ్గడించుచు బోధ
సేయవలయుఁ బుణ్యసిద్ధి గాఁగ. 15

ఉ. నా ప్రియ ధర్మపత్ని సుగు
ణంబులుఁ, దచ్చరితాంశముల్ తదీ
య ప్రణయ ప్రకారములు
నందును నందును గుప్పు గుప్పునన్
గ్రప్పుఁ బల్కులో యనఁగఁ
గమ్మని తావులఁ గుమ్మరించుచున్

నీ ప్రతిభా విశేషముల
నిగ్గులతో విలసిల్లఁగావలెన్. 16

క. ఆకృతి నత్యంతమనో
జ్ఞాకృతిగా ముద్రణమున నలరించి సుధీ
లోకము మెచ్చఁగ వనితా
నీకమున కమూల్య ధర్మనియతి నొసఁగెదన్. 17

గీ. ధర్మసతి పేరు ధర శాశ్వతముగఁ జేయఁ
జాలుటకు నాకు 'సంతాన సప్తకమున
సత్కృతి యొకండె' యనెడు నిశ్చయము గలిగి
యిట్లు కోరితి నిన్ను నీకృతి రచింప. 18

గీ. ప్రథమ పత్నీవియోగ సంభవ దనూన
దుఃఖసంతాపమునఁ గ్రాఁగి తూలు నాదు
డెందమునకు సుధారసస్యందిని యగు
సత్కృతియె కొంత యుపశాంతి సలుపవలయు.

క. అది నీ వచిరముగ రచిం
చెద నని వచియించి నాదు చిత్తమునకు స
మ్మద మొదవ సెల వొసంగుము
మదిలో మన మైత్రి యెపుడు మఱకుము సుకవీ!

ఆ. అనుచుఁ దనదు కోర్కె యంతయు వివరించి
భక్తిగౌరవములు ప్రస్ఫుటముగ
ఫాలతలము నాదు పదములపై సోఁక
నంటి మ్రొక్కె యాతఁ డరుగఁ గోర. 21

ఉ. ఆమెడ నేను సట్టి సుహృ
దగ్రణి కోరిన మేటి కోర్కెకిన్,
దీయని యమ్మహాశయు మ
దిన్ విలసిల్లుచు నింతగ్నేసియున్
బాయని తత్ప్రియాప్రణయ
భావసమృద్ధికి, నాత్మగౌరవ
శ్రీయుతమైన తద్వచన
రీతికిఁ జేతమునందు మెచ్చుచున్. 22

క. స్మరణీయ మైన తొల్లిటి
తరుణిమెడన్ స్థిరత నున్న తత్ప్రిణయ రసా
దరమును సద్భావమ్మును
నరసి కడున్ సంతసించి యబ్బురపడుచున్. 23

ఆ. తద్గుణాఢ్యు నభిమతమునకుఁ దగునట్లు
లుచితరచన, స్త్రీజనోపయోగ

కరము నీతిధర్మభరితంబు నగు కబ్బ
మొకఁడు గూర్చు టదియు నుచిత మనుచు. 24

వ. నామనసంబున నిశ్చయించి యాతనితో నిట్లంటి.

ఉ. సరసాగ్రేసర! నీమనోరథము స
త్సంకల్పమున్ దద్గుణా
దరమున్ దత్ప్రణయప్రకారముఁ గవి
త్వప్రీతియున్ నాకు నూ
త్న రసావేశముఁ గూర్చు చున్నయది; కా
నన్ నీయభీష్టంబు చే
కుఱ నేదేనియు నట్టి కబ్బమును నీ
కుం గూర్ప యత్నించెదన్. 26

క. భగవ దనుగ్రహమున నీ
దగు సంకల్ప బలముననె నదియును నచిరం
బుగ వెలయ వచ్చు; దానికిఁ
దగు పూనిక నూని చూచెదన్ సాధుమణీ! 27

గీ. అనుచు నే నాప్రియాతిథి నట్లు వీడు
కొల్పి మనమున నతని సంకల్ప మెట్లు
తీర్పఁ గలవాఁడ నేకృతిఁ గూర్పఁ బూను
వాఁడ ననియెడు తలఁపు లూఁగాడ నంత. 28

వ. మదీయ నికేతనంబునం దొక్క నిరుపహతిస్థలం
బున విశ్రమించి నిమీలిత లోచనుండ నై
యాలోచనైకాయత్త చిత్తుండ నై యుండుటయు
నానమయంబున. 29

గీ. నిదుర పట్టఁగఁ బోలు! నాయెదుర నభ్ర
పథమునం దుడుమండల ప్రాంత సీమ
స్ఫుట తరంబుగ నిర్వురు పుణ్యసతులు
కాన వచ్చిరి స్వప్నంబులోన నాకు. 30

క. తెరమీఁదఁ బొలుచు బొమ్మల
తెఱఁగున విస్ఫుర దనూన దివ్యాకృతులై
వఱలెడు వారలఁ గన్నులు
మిఱు మిట్లు గొనంగ నేను మింటన్ గంటిన్. 31

ఆ. వారి లోన నొక్క వనిత తపస్వినీ
వేష యగుచు మిగుల వృద్ధ భావ
కలిత యైన భంగిఁ గాన్పించె; నొకయామె
తరుణ దశఁ దనర్పు కరణిఁ దోఁచె. 32

సీ. వృద్ధతాపసి గట్టె విలసిల్లు చెంగావి
వడుచు ధరించె మే ల్పట్టు చీర

యోగిని మెడలోన నొప్పె రుద్రాక్షలు
తరుణి కంఠమున రత్నములు మెఱసె.
ముదుసలి యొడలిపై ముడుతలు గాన్పించె
యువతి దేహము పుష్టి నొప్పి యుండె
జరఠ పచ్చని మేని చాయ భాసిలు చుండె
జవ్వని చామనచాయఁ దనరె

తే. పెద్ద యైదువ యది శత వృద్ధ యట్టు
లరయఁగా నయ్యె; న జ్జవరాలు నిరువ
దేండ్ల ప్రాయంబు గల యట్టు లెసఁగు చుండెఁ
బూర్ణ సౌభాగ్యలక్ష్మి యిర్వురకుఁ దగియె. 33

వ. ఇట్టు లత్యంత మనోహరంబు లైన వార్ధక్య
తారుణ్యంబులం దనరు నప్పుణ్యాంగనాయుగ్మం
బుం గనుంగొని లోచ నోత్సవకరం బైన తత్పు
ణ్యకాంతాదివ్యదర్శ నానందంబు ననుభవించుచు
నిమ్మహా తేజ స్సంపన్ను లైన పుణ్యకాంత లెవ్వా
రై యుందురో యని నేను నా డెందంబున
సందియం బందుచు వారివంక నీక్షించు చుండు
టయు నాసమయంబున. 34

ఉ. అబ్బురపాటు వోఁచు నయ
 నాంబుజ యుగ్మము నుండి పొంగి పై
కుబ్బెడు తళ్కు లెల్లెడల
 నుత్పల మాలిక లై చెలంగఁ ద
బ్బిబ్బుగ నట్టు నిట్టుఁ గని
 భీతియు నచ్చెరుపాటు వంతయున్
బ్రిబ్బికొనంగ నప్పడుచు
 పైదలి సంభ్రమ సంకులాత్మయై. 35

తే. వృద్ధతాపసిఁ గని భక్తిబద్ధపాణి
పంకరుహ యయి వినయ సంపద యెసంగఁ
బ్రస్ఫుటం బగు మృదువాక్య ఫణితి నిట్టు
లనియె నాయమ సాదరయై వినంగ. 36

ఉ. ఇవ్విపులాంతరాళ మిది
 యేమిటి ? తల్లిరో ! యేప్రదేశ ! మీ
వెవ్వతె వౌదు వో భగవ
 తీ ! యిట నేమిటి కిట్టు లుంటి ? వే
నెవ్విధి నిందుఁ జొచ్చితినో
 యేమియు నా కెఱుగంగరాక యో

యవ్వ ! మహాద్భుతంబు హృద
యంబుఁ గలంచుచు నుండె నా కిటన్. 37

క. అతి మానుషంబు నీ యా
కృతి వైభవ మిది తపస్విగృహిణివో మహిత
వ్రతయైన యేమహాపతి
రతవో నా కెదియు నెఱుఁగరాదు గదమ్మా! 38

గీ. నాకుఁ బరిచిత మైన భూలోకమట్లు
గాన రాకున్న దిది యేవొ గగనసీమ
యీ మహాజ్యోతు లన్నియు నేమి? యిచటి
యీ విమానము లన్నియు నెవరివమ్మ ! 39

వ. అని యిట్లడుగుచుండ నంత నక్కాంత కట్టెదుట
మహా తపస్సంపన్నులైన కొందఱు జడదారులు
పొడఁగన వచ్చుటయు వారిం గనుంగొని తత్తఱ
పడుచు నయ్యుత్తమతరుణి వెండియు నత్తాపసి
కిట్లనియె. 40

ఆ. అబ్బురంబుమీఁద నబ్బుర మిది దేవి !
వార లెవరు ! బ్రహ్మవర్చసంబు
మూర్తు లనఁగఁ దనరు మునిపుంగవులు దివ్య
తేజు లనుపమాన దీప్తి యుతులు. 41

సీ. ప్రణయైకశీలుఁడై బహువిధంబుల నన్నుఁ
ప్రేమించు మత్ప్రాణవిభునిఁబాసి
యల్లారు ముద్దుగా నలరుచు నభివృద్ధిఁ
బొదలు మదీయైకపుత్త్రి విడిచి
ప్రకటానురాగ సంపదతోడఁ దోడు నీ
డై యున్నవాని నాయన్న విడిచి
ఘనతరాదరభావగౌరవాదుల మహో
త్తములైన నాదుచుట్టముల విడిచి
తే. యక్కటా! యేలవచ్చితినమ్మ యిటకు?
నేరితోఁ జెప్పనైతి నావార లెల్ల
నన్నుఁ దలపోసికొనుచు డెందముల నెంత
వంతఁ జేడ్పడుచున్నట్టివారొ యెఱుఁగ. 43

సీ. చిరకాల సహవాససిద్ధి నాప్రియభర్త
నలరించి నేఁ గూర్మి నలరనైతిఁ
బ్రియమార నాచిన్ని బిడ్డ చూపెడు ముద్దు
ముచ్చటల్ గాంచి నే మురియనైతి
ఘనతరధర్మార్థకామాభివృద్ధిగా
గార్హస్థ్యవిధుల నేఁ గడపనైతి

సంపూర్ణ సత్క్రియాచరణాభిరతి వెల్ల
డించి నేఁ గీర్తి గడింపన్న తి

తే. సర్థి సంతతులకుఁ జేతులార! నభిమ
తార్థము లొసంగి చిరకాల మవని జీవ
యాత్ర సలుపఁగనుండ, నోయమ్మ! నాకుఁ
గలుగఁబోదయ్యె నట్టి భాగ్యం బదేల? 44

చ. ప్రియుఁడగువాఁడు నా యెడలఁ
బెంపగు ప్రేముడి గల్గువాఁడు స
ద్వ్యయ మొనరించువాఁడు గుణ
వంతుఁడు శాంతుఁడు నిత్యధర్మ ని
శ్చయమతి యట్టి నాపతికిఁ
జాలఁగ దవ్వయి వచ్చితిన్ గృపా
శ్రయ! యతఁ డిప్పు డెంతటి వి
చారమునన్ దురపిల్లుచుండునో! 45

గీ. పెండ్లియైనది మొదలు నాప్రియుఁడు నన్ను
మించు కూరిమితోడఁ బ్రేమించినాఁడు
నిముస మేనియు ననుఁ బాసి నిలువలేఁడు
ఏమి సేయుదు నిపుడిది యెట్లు? తల్లి! 46

క. సోదరి యిది యొకతే యను
నాదృతి నను ముద్దుసేయునట్టి మహాభా
గ్యోదయుఁడు మన్నగజుఁ డతి
ఖేదముఁ గొను నన్నుఁ గనక కృతనిర్గతన్. 47

ఉ. ఏ మనవచ్చు నా మఱఁది
కెంతయు నా యెడ భక్తి హెచ్చు; మ
త్ప్రేమను నక్కుమారుఁ డయిఁ
బెంపయి యుండు; నతండు మద్వియో
గామిత దుఃఖ మెట్లు తఱి
యంగలఁడో? యతఁ డన్న, లక్ష్మణ
స్వామికి సాటియైన గుణ
శాలి గదమ్మ! మహాతపస్వినీ! 48

మ. కరుణానందమయాంతరాత్ముఁ డగు నా
కాంతున్ సముద్వృద్ధుణో
త్తరయై వర్ధిలు నా యనుంగుఁ దనయన్
దత్తాదృగత్యాప్త సో
దరముఖ్య ప్రియబంధుజాతమును సో
త్సాహంబుగా నింక నే

మరలం గాంచెడు భాగ్య మున్న దే? జగ
న్మాన్యా! మఱేనాఁటి కేన్?	49

చ. అని యిటు లాప్త భర్త్రు విర
హ ప్రియబంధు వియోగ సంభవ
ఘ్నతర దుఃఖవహ్ని మదిఁ
గ్రాఁపఁగ విహ్వల యాచు వెచ్చ వె
చ్చని నయనాశ్రు బిందువులు
సన్ననిపయ్యెద జాలువాఱ న
వ్వనిత మహార్తిఁ తోడ వగ
వం గని యెంతయు సుప్రసన్నయై.	50

తే. ఆత్మవల్లభ కేవలాయత్తమైన
యత్తరుణిచిత్తవృత్తికి నాత్మ నలరి
జాలిఁ జెందుచు నా వృద్ధసాధ్వి యామె
కాదరాయత్తయై యిట్టు లానతిచ్చె.	51



శ్రీరస్తు.

# స్వ ప్నా న సూ య.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీ నిలయ వణిగ్వంశ ప
యోనిధి రాకాసుధారు గుజ్జ్వలరేఖా !
మానితపాతివ్రత్య ని
ధానా! యనసూయ! ప్రణయతత్త్వనిదానా!52

చ. వగవకు మమ్మ! నీ హృదయ
వల్లభునిం, బ్రియపుత్త్రి, నెల్లబం
ధుగులను వీడి యొంటి నిటు
దూరముగాఁ జనుదెంచినందు కో
సుగుణనిదానమా వినుము
శోభన సంస్థితి నే వచింతు; నిం
పుగ నది యాలకించి పరి
పూర్ణముదంబు వహింతు వీ వికన్. 53

గీ. అనుడు నప్పుణ్యసతి నుడు లాలకించి
తొంటికంటను మిగుల నద్భుతము నిగుడ
మగుడ దోసిలి యొగ్గి యా చిగురుబోడి
వినయ వినమిత యగుచు నిట్లని వచించె. 54

శా. ఏమీ! నీమహితప్రభావ మది దే
వీ! యెట్టిదో; కాని మ
న్నామంబేను వచింపకుండఁగనె వి
జ్ఞానైకతానంబ! నీ
సామర్థ్యంబుననే యెఱింగితి మహై
శ్చర్యంబుగా; నిత్తఱిన్
నామీఁదం గృపచేసి నీచరిత మా
నందంబుగాఁ దెల్పవే! 55

క. ఏమి సుకృతంబు చేసితి
నో మాన్యచరిత్రి! నీమహోజ్జ్వలమూర్తి
శ్రీ ముదముమీఱఁ గంటి; న
హా! మజ్జన్మంబు ధన్య మయ్యెఁగదమ్మా! 56

వ. అని యిట్లు ప్రార్థింప నయ్యుత్తమతరుణి కత్తాపసి
మరల నిట్లనియె. 57

క. నీవెట్లును ధన్యవె పు
త్రీ! విను మనసూయ! నీకుఁ దెల్పెద నాయీ
యావద్వృత్తాంతములును
భావ మలర నీకుఁ దోఁచుపాటు వోలంగన్. 58

సీ. వసుధ వణిగ్రాజవర్యులై విఖ్యాతిఁ
గన్న మోతేవారి ఘనకులమున
నుద్భవంబంది చుండూరివంశపయోధి
రాజు నారాయణరావనంగఁ
బ్రఖ్యాతుఁ డగువాని భర్తగాఁ జేపట్టి
యుభయగోత్రములుఁ బెంపొందునట్లు
మెలఁగి నీ ప్రియభర్తవలన నొక్క కుమారి
శుభమతియగుదాని 'సుగుణమణిని'
తే. గాంచి, నీసద్గుణముల నీకాంతు నాప్త
బంధులోకంబు నలరించి పరమపదముఁ
జెందవచ్చిన యనవద్యశీల వీవు
ధన్యురాలవు గాకేమి మాన్యచరిత ! 59

సీ. నీతండ్రి ధర్మాభినిరతుండు కీర్తివి
స్తారుండు వెంకన్న ధన్యతముఁడు

సీమామ సద్గుణాన్వితుండు మాణిక్య
నామధేయుండు దాన చతురుండు
నీతల్లి యచ్చమ్మ నిఖిలబాంధవలోక
సమ్మాననీయ ప్రశస్తచరిత
నీయత్త సుకృత ధర్మాయత్త మాణెమ్మ
పరమ పాతివ్రత్య భవ్యశీల
తే. నీదు ప్రియభర్త సుకవివర్ణిత చరితుఁ
డుర్వి శ్రీకృష్ణ భారతాద్యుచితకావ్య
భర్త, సముచిత సత్కార్యకర్త! నీవు
ధన్యురాలవు గాకేమి తలిరుబోఁణి. 60
క. నీ యగ్రజుండు విభవ
శ్రీ యుక్తుఁ డుదారుఁ డల నృసింహారాయం
డా యనఘు ననుజ వీ వే
తోయమునను ధన్యవే వధూతిలకంబా! 61
వ. ఇదియునుం గాక :— 62
ఉ. అంచిత వృత్తి సర్వ సుగు
ణాధిక వై తొలిబాములందుఁ గా
వించితి వీ వనేకములు
విశ్రుత సత్క్రియ; లుల్లమందు సే

వించితి భక్తి భావమున
విశ్వ విభుం బరమేశుఁ; గీర్తి నా
ర్జించితి వత్యుదార కుల
శీల చరిత్రములన్ దలోదరీ ! 63

గీ. అవియు, జన్మాంతరకృతంబు లగుట నీకుఁ
దెలియరా కున్న విపుడు సాధ్వీమతల్లి !
మానవాంగన కట్టి విజ్ఞాన శక్తి
గలుగ నేర్చునె యిఁక నీకుఁ గలుగుఁ గాక! 64

క. ఏవంవిధ గుణవతి వై
భావుకవృత్తమునఁ బరమపాతివ్రత్య
శ్రీ వెలసిన కతమునఁ గా
దే! వచ్చితి విటకు దివ్య దేహము వడయన్.

క. అని యిట్లు తనదు జననీ
జనకాది సమస్త బంధు సమితిక్రమమున్
దన భర్తృ వర్తనంబును
మనమున కాశ్చర్య సంభ్రమము లెక్కుడు గాన్.

క. వినుపఁగ, నత్తాపసి పద
వనజంబుల వ్రాలి యాయువతి భక్తిమెయిన్

గనుదోయి కద్దుకొనుచున్
దనరఁగ సాష్టాంగ సుప్రణతయై యుండెన్. 67

ఆ. అట్లు ప్రణత యైన యనసూయ నావృద్ధ
తాపసియును గూర్మి దనర లేవ
నెత్తి బుజ్జగింప, నిట్లనె వెండియు
నవ్వధూటి భక్తి నామెతోడ. 68

శా. ఈరీతిన్ మదుదంత మంతయును ద
ల్లీ! నీవు సర్వజ్ఞవై
యారూఢస్థితిఁ దొంటి నుండియు యథా
ర్థానుక్రమం బొప్ప స
త్కారుణ్యంబున వెల్లడించితి జక
త్కల్యాణి! నీ వెవ్వరో
గౌరీదేవివో! లేక, బ్రహ్మసతివో!
కాకున్న శ్రీదేవివో! 69

తే. అట్లునుం గాక నన్నుఁ గాపాడఁ దలఁచి
వచ్చిన మదీయ భాగ్యదేవతవొ యేమొ
కరుణతో నింక నీదు సంగతి యదెల్లఁ
జెప్పి నన్నుఁ గృతార్థను జేయఁగదవె. 70

తే. అనిన, దరహాస పరిశోభి తాస్య యగుచు
వృద్ధతాపసి "యో వత్స ! వినుము నీవు
సందియము లెల్లఁ దీఱ, నానంద మొదవ
నిచటి వృత్తాంత మెల్ల నీ కెఱుకపఱతు. 71

క. ఇది తారాపథ ; మిట నీ
యెదుటిది కనుఁగొంటె సప్తఋషిమండల ; మ
య్యదియె మదీయావాసము
వదలక నేఁ బ్రాయికముగ వర్తింతు నటన్. 72

సీ. అదితికి దితికి నెయ్యపుభర్త యాతఁడే
కశ్యపుఁ డమర రాక్షస గురుండు
కనుఁగొను మతఁడె లోకత్రయ నుతుఁడు కా
లత్రయ విజ్ఞాని యత్రి మౌని
ప్రకటిత మహిత ప్రభావ సంపన్నుఁ డా
తఁడె చూడు మల భరద్వాజుఁ ; డదిగో !
సృష్టికిఁ బ్రతిసృష్టి చేసినవాఁడు వి
శ్వామిత్రుఁ డను ఋషివరుఁ డతఁడె

తే. గౌతముఁ డనంగ భువన విఖ్యాతుఁ డైన
పరమ మౌనీశ్వరుఁ డతండె ; పరశురామ

భగవ దవతార సృష్టికిఁ బద్మయోని
యైనవాఁ డాతఁడే జమదగ్ని వత్స! 73

సీ. ఆర్త్విజ్యమున వివిధాధ్వరకృత్యముల్
సేయించి యభిమత సిద్ధిఁ గూర్చి
యాచార్యుఁడై సమస్తాగమార్థ రహస్య
ములను బోధించి విజ్ఞుల నొనర్చి
మంత్రిత్వమున నసామాన్యరాజ్యక్రియా
సందర్భముల ననంశయులఁ జేసి
సత్పురోహితుఁ డయి సతత ముత్తరకాల
ఫలములచేఁ గృతార్థుల నొనర్చి
తే. రఘుకులోద్వహు లగు మహీరమణమణుల
కెల్ల కులగురువై వాసి కెక్కి నట్టి
భావితాత్ముండు దివ్యతేజో విశేషుఁ
డతఁడె సుమ్మి వసిష్ఠమహర్షి వత్స! 74

క. పతి హిత వృత్తిం దత్సం
గతి విడువ కనారతంబు గాఢతపస్సం
భృతి మెఱయు చున్నది యరుం
ధతి యదిగో భక్తి మ్రొక్కి దర్శింపఁగదే. 75

క. అపవిత్రులకును బాప
వ్యపహాత దృష్టులకు నపగతాయుష్కులకున్
సు పతివ్రత యీ యమ తా
నెపుడు న్నిజ దర్శనంబు నీ నొల్లదు చూ. 76

క. ఏ నా యత్రి మహాముని
ప్రాణాధిక మైన ధర్మపత్నిని, యనసూ
యా నామధేయ; ననసూ
యా ! నానామంబె నీకు నయ్యె ధరిత్రిన్. 76

వ. అది యెట్లు సంభవించె నందు వేని చెప్పెద నాల
కింపుము. 77

తే. ధర్మ పరు లగు నినుఁ గన్న తల్లిదండ్రు
లరసి యే నుత్తమాంగన నని తలంచి
నావలె న్నీవుఁ బేరొందఁ గావలె నను
కోర్కి నాపేరు నీ కిడుకొనిరి వింటె. 78

వ. మానవ లోకంబున నుచితజ్ఞాన సంపన్నులైన
జననీజనకులు ప్రాయికంబుగాఁ దమయనుంగు
బిడ్డలకు మహామహులైనవారినామధేయంబులు
ను, సముచితార్థంబులు గల యభిధానంబులునుం

బెట్టి తమ పట్టు లట్టి నామధేయంబులు సార్థకం
బులుగాఁ బ్రవర్తింప వలయు నని యాకాం
క్షించుచుందు ; రయ్యది నీవు నెఱింగినయదియ
కాదె ? 79

ఆ. అ ట్లెఱింగి కాదె యనుఁగుఁ గూఁతునకట
"సుగుణమణి" యటంచుఁ దగిన పేరు
పెట్టుకొనిరి నీవు ప్రియభర్తయును గూడి
తత్సమాఖ్య సార్థతన్ వహింప. 80

క. అది యట్టు లుండెఁ; గనుఁగొను
మదె యా జ్యోతి స్స్వరూప లగు తారల; వా
రదితియును దితియు మున్నగు
త్రిదశ పతివ్రతలు సుప్రథితచారిత్రల్. 81

వ. ఇదియునుం గాక :— 82

వారి చెంగటఁ జూడు మా తార లెల్ల
మనుజలోక పతివ్రతా మణిగణావ
తార, లత్యంత పావనాచార, లత్యు
దార, లతుల సౌభాగ్య విస్తార లబల ! 83

సీ. తన పావనత లోకమునకుఁ జూపఁగ నొక్క
పరమ పవిత్రి చిచ్చుటికి బ్రదికె

భర్త యంధుం డౌట భావించి యొక సతి
కనులకు గంతలు గట్టుకొనియెఁ
బరలోక గతుఁడైన పాండురాజుకు నొక సాధ్వి
బ్రదికించుకొనియె స్వప్రతిభ కలిమి
నొక పతివ్రత భానుఁ డుదయింపఁ బతికిఁ గీ
డగు నని రాత్రిఁ దా నట్లె నిలిపె

తే. నొక్క పతిదేవత మహామహోగ్ర మన్న
హామయగ్రస్తుఁ డైన నిజాధినాథుఁ
జెంగిభులు మెక్క నింతేని యేవఁ గొనక
వారలే యమ్మహాపతివ్రతలు పుత్త్రి! 84

గీ. ధాత్రిఁ దమతమ యుత్తమోదాత్త చరిత
ముల వినుతిఁ గాంచి పతిభక్తి నలఘుశక్తి
ముక్తిఁ గని వచ్చి యీలోకమున నఖండ
శాశ్వత సుఖంబుఁ గొనుచున్న సతులు వారు!

చ. గురుహిత వృత్తులై ప్రియుల
కుం బ్రియులై నిజ ధర్మ నిష్ఠ సు
స్థిర లయి పుణ్యకార్యముల
చే శుభ శీల సమృద్ధిచే గుణో

త్తర లగు నిట్టి సత్సుతులు
దక్క మఱొక్కరు తొక్క నేర రీ
పరమ పదంబు శాశ్వత శు
భ పరిచుర ప్రమదంబుఁ బుత్త్రికా! 86

ఆ. నీ వనేక జన్మ నిష్పన్న పుణ్య సం
చయవు, భర్తృ హిత వినయవు నగుటఁ
గలిగె నింత యచిర కాలంబు నంద యీ
పుణ్య లోక సుఖముఁ బొంద నిపుడు. 87

గీ. అయిన నింకను సూక్ష్మ దేహాస్థిత వయి
మసలు చుంటివి కావున మనుజ జన్మ
వాసన యొకింత గలదు; తద్వశత నిన్నుఁ
బాయ కున్నది యజ్ఞాన పాటవంబు. 89

క. దానం జేసియ నీ విటు
మానవ లోకమున నున్న మగనిన్ గూఁతున్
మానితు లగు బాంధవులను
లో నెంచుచు వగచు చుంటి లోలత్వమునన్.

తే. అట్లె కా కున్న, నిట్టి దివ్య పదమునకు
వచ్చియు నశాశ్వతము లైన వసుధ మీఁది

పతి సుతాదిక భాగ్య సంపదలఁ దలఁచి
వగతురే! యవ్వి యేపాటి వైభవములు ? 90

సీ. క్షణములో జన్మించి క్షణములో వర్ధిల్లి
క్షణములో బాల్యదశం దొలంగి
క్షణములోఁ గ్రొంగ్రొత్త జవ్వనంబు వహించి
క్షణములో గార్హస్థ్య సరణిఁ జొచ్చి
క్షణములో సంతాన సంపద విలసిల్లి
క్షణములోఁ బ్రౌఢదశం జెలంగి
క్షణములో సంసార సర్వసౌఖ్యము లొంది
క్షణములో ముదిమిచే సన్నగిల్లి
తే. చనెడిదే గాదె మానవ జన్మ రీతి?
యట్టి క్షణిక సుఖంబున కాసఁ జేసి
వేఁడు టనునది యజ్ఞాన విలసితంబు
గాక వేఱొండు గాదుగాదే కుమారి ! 91

వ. మనుష్యజన్మ స్వభావం బిట్టిద యైయున్నను గొందఱు మానవాంగన లజ్ఞానాంధకారంబున నిమగ్నలై కన్నుఁ గానకయు, నస్థిరం బైన యౌవన మదోద్రేకంబునఁ బ్రమత్తలై యొడ లెఱుంగకయు నిజ దేహ సౌందర్య సంపదాదులు

నిత్యంబులై నిల్చియుండునవియుం బోలె భా
మించి విఱ్ఱవీఁగి యాత్మ ధర్మంబు నెఱుంగ
నేరక, యనుచిత కృత్యంబులకుం బాల్పడి, యం
త్యకాలంబున నధోగతిం జెంది యటమటించు
చుందుః రట్టి వారల కెన్నటికి నిట్టియున్నతలోక
నివాససౌఖ్యంబు చేకూరం బోవదు ; నీయట్టి
యుత్తమాంగనలకు మాత్రమే యియ్యది ముం
గొంగుపసిండి యై యుండుఁ; గనుంగొనుము. 92

తే. అల్లదే నీదు తేజోమయ స్వరూప
మనుప మానందమయము నీ వందుఁ జొచ్చి
మరల నేనాఁటి కే నిఁకఁ దిరిగి రాక
పొందుగా నందె విలసిల్లు చుందు వమ్మ! 93

క. నీ యజ్ఞానము నిన్నిఁకఁ
బాయు న్నిరూప మిదియుఁ బ్రకటముగా ; దిం
కేయెడ నీ యెడఁద విచా
రాయత్తము గాదు కేవ లానందంబై. 94

ఆ. ధరణి నీకు భర్త ధర్మాభిరతుఁ డయి
నీదు సుగుణములను నిరత మాత్మఁ

దలఁచి కొనుచుఁ బ్రణయతత్త్వస్వరూపుఁ డై
యున్నవాఁడు పరమ యోగ్యుఁ డగుచు. 95

వ. అతండు నీ వియోగంబున విరక్తుండై సర్వసంగ
పరిత్యాగంబు సేయం దొడంగినవాఁ డయ్యును
నిజబంధుమిత్త్రాది నిర్బంధవశంబున వంశాభివృద్ధి
పొందెను సత్కార్యాచరణంబునను దపత్నీకత్వ
దోషపరిహారంబుఁ గావించుకొనుపొందెను బున
స్స్వీకరణం బొనర్చి యున్నవాఁడు. సహజాన
సూయ వైన నీ వింమల కసూయుం జెందుదానవు
కావు గదా ? 96

ఆ. నీ సపత్ని ధర్మ నిరతాత్మురా లయి
త్వ ద్వియోగ తాప తప్తుఁ డైన
పతికిఁ గొంత హృదయ పరితాప శాంతిఁ గా
వించు చున్న దుచిత వృత్తిఁ బూని. 97

క. అదియును సద్గుణవతి యై
హృదయేశుని చిత్త మెఱిఁగి యెల్లయెడల స
మ్మద మొదవంగ మెలఁగు చు
న్నది భయభక్తులును నయవినయములుఁదనరన్.

క. ఆ వెలఁదుక నిజ గృహిణీ
భావంబున నట్లు సకల భంగులఁ దన్నున్
సేవింప నతఁడు సద్గుణ
సేవధి యై యిష్ట సౌఖ్య సిద్ధులు వడయున్. 99

ఆ. నీ యనుంగు బిడ్డ నిరవద్య తర చిత్త
"సుగుణమణి" యథార్థ సుగుణ మణియ
యగుచుఁ జిరత రాయు రారోగ్య భాగ్యాదు
లొప్ప ధాత్రి వృద్ధి నొందఁ గలదు. 100

చ. కడుపునఁ గన్న కూర్మి సుత
కైవడి నెప్డు దవ్వ దగ్గ్రిజుండు ప్రే
ముడి నిగుడంగ నీ సుతకు
ముద్దును ముచ్చటఁ దీర్చి సంపదల్
పొడవుగ నాత్మ సద్మమునఁ
బ్రోచుచు నుండె; నతండు దాని కే
యెడ నొక లోపముం గలుగ
నీయఁడు సత్కరుణార్ద్ర చిత్తుఁడై. 101

క. లక్షాధికారి సద్గుణ
లక్షితుఁ డతిమృదుళహృదయలలితుఁ డుదారుం

దక్షిణ కీర్తి కాముం
డా క్షితిపతి నీ కుమారి నట్టిట్టు గనునే. 102

క. మీ వదాన్యుడైన యా ప
ద్మావతియును మిగుల ధర్మతత్పరమతి; స
ద్భావమ్ము వెలయ నీసుత
కేవేళను గూర్మి సేయు నీవును బోలెన్. 103

క. నిను విడిచినది మొదలుగ నీ
తనయ సుగుణమణియుఁ, గన్నతల్లిని నిను బా
సిన లోపము లేకుండఁగఁ
బెను పొందుచు నుండె నామె ప్రేముడివలనన్.

క. నీ విభుని యెడల గౌరవ
భావము సౌభాగ్యశ్రీయును బ్రవర్ధిల్లఁగ నీ
దేవరుఁడు వేంకటేశ్వర
రావును సుఖముండు సుగుణరమ్యుం డగుచున్.

గీ. కాన, నీ విఁక నీదు డెందాన నెట్టి
వగవఁ బనియును లేదు ; నీ వారు, నీకు
శాశ్వతానంద మయ మహోచ్చస్థితి యగు
టెఱిఁగి నీ కయి వగఁ జెంద రింక మీఁద. 106

క. నీ కీర్తి దుర్గ భోన్నత
లోకస్థితి గలిగె నని విలోకింపఁగ భూ
లోకస్థులు నీ బందుగు
లేకరణి న్నేర్తు రనిన నిది వినుము సుతా! 107

ఉ. ఇక్కడ నీవు నేను నిపు
డి ట్లొనరించు ప్రసంగ సంగతుల్
చక్కఁగ మత్ప్రభావ విల
స త్ప్రతిభా ప్రతిభాసి తార్థుఁ డౌ
నొక్క మహా కవీంద్రుఁడు సు
యోగ దశం దెలియంగ నేర్చి స
మ్య క్కృతిగా రచించు నిజ
మంజుల వా గ్విభవ ప్రశస్తిచేన్. 108

క. క్రమముగ నీ పతి ప్రోత్సా
హముచే న క్కవి వతంస మచిరముగ రచిం
చు మృదు మధుర గతి న య్యు
త్తమకృతి కడురమ్యమగుచు ధాత్రిన్ వెలయున్.

తే. తత్ప్రశస్త కవి ప్రబంధంబువలనఁ
దెల్ల మగు నీదు వృత్తాంత మెల్ల ధాత్రి

దాని నెఱిఁగి త్వదీయ బాంధవ గణంబు
సంతసం బందు దుఃఖోపశాంతిఁ జెంది. 110

క. అని యిటు లయ్యత్రి తపో
ధనముఖ్యుని ధర్మపత్ని తనయెడలఁ గృపా
ఖనియై సాదరముగఁ బ
ల్కిన విని యనసూయయుఁ బులకితతనువగుచున్

ఉ. పొంగెడు భక్తి నప్పరమ
పుణ్యచరిత్రి పదద్వయంబుఁ గ
న్నుం గవ కద్దికొంచు సుమ
నోహర భంగి మఱొక్కచూఱు సా
ష్టాంగ నమస్కృతిన్ సలిపి
హర్ష జలాప్లుత నేత్రి యుగ్మ యా
చుం గమనీయ మంజుల వ
చో విభవంబు దలిర్ప ని ట్లనెన్. 112

క. ఓ విశ్వప్రథిత మహా
పావన చారిత్రి! సుప్రభావ జలనిధీ!
నీవేనా యనసూయా
దేవివి మాతల్లి! సత్సతీమతల్లీ! 113

క. ఏపట్టున నెన్నండును
గోపో(ద్రేకపరిసక్తిఁ గొనఁబోవక స
ద్వ్యాపారపరత ననసూ
యాపావనసంజ్ఞఁ గొనిన యమ వీవేనా? 114

సీ. సురనదీతీర భాసుర తపోవనభూమిఁ
బదివేల యేండ్లు తీవ్రతర దీర్ఘ
నిష్ఠఁ గైకొని బహు నియతిమైఁ బవళులు
రేలును విడ కొక్క రీతి ఘోర
తర తప మొనరించి ధన్యాత్మ వైనట్టి
మానినీ మణివి నీవే నఁటమ్మ!
పదియేండ్లు మివుల డెప్పరమై యనావృష్టి
దవులఁ జేడ్పడు భూతధాత్రి నాత్మ

తే. సత్తపశ్శక్తి ఫల మూల సస్య కలిత
గా దయామృత వృష్టిఁ జక్కఁగాఁ గురిసి
చెడక యుండఁగఁ దొలి కటాక్షించినట్టి
మానిత మహా చరిత్ర వీవే నఁటమ్మ! 115

క. సుర కార్యార్థం బై యు
ర్వర దశరాత్రులును నొక్క రాతిరిగా న

త్యురుతర మహిమాన్వితవై
తరలించిన యీ పతివ్రతవు నీవేనా ? 116

క. పూతవు, నిఖల వ్రత సు
స్నాతవు, రక్షిత సమస్త జగతీ జన సం
ఘాతవు, లోకాతీతవు
మాతల్లీ ! నిను నుతింప మాతర మగునే ? 117

చ. నిజ పితృవాక్య పాలన వి
నిశ్చల భావముతోడ రాజ్యమున్
స్వజనము వీడి ఘోరవన
వాసము సేయఁగఁ బోవు భర్త వెం
ట జనకజాత నీదు నిక
టంబునకుం జనుదెంచి నప్పుడ
క్కజ మగు నంగరాగమును
గానుక వెట్టితి వామె; కీవె కా ? 118

క. నీ పుణ్య దర్శనం బా
హా ! పరమానంద కంద మై విజ్ఞానో
ద్దీపకమై నా కనులకుఁ
జూపట్టె సుధా ప్రయుక్త శుద్ధాంజనమై. 119

వ. అని మఱియు ని ట్లనేక విధంబుల స్వకీయపౌరా ణిక జ్ఞాన సంపత్తి వశంబునం బ్రస్తుతించి యభి నందించుచున్న యయ్యనసూయయెడల నయ్యన సూయాదేవి మఱియుం బ్రసన్నయై స్వనామాభి మానంబుచేతనే గాక స్వచారిత్ర విజ్ఞానాభి మానంబుచేతనుం దద్దయు గారవించి "వత్సా! నీ కిట్టి విద్యాజ్ఞాన సంపత్తియుఁ బురాకృతపుణ్య వాసనావశంబునఁ బ్రాప్తించినదియ. నీ జ్ఞాన విశేషంబునకే నెంతయు సంతసించినదానం; గాని యిప్పుడు శాశ్వత దివ్యలోక నివాసమహా నందంబు ననుభవింప నున్న నీకుఁ దొల్లి సీతా దేవికిం బోలె సంతోషదాయకం బైన పారితో షికం బెద్దియేని యనుగ్రహింప వలసిన యావ శ్యకత్వంబు గాన్పింప కున్నయది; యట్లయినను నీయభిప్రాయంబు నెఱుంగం గోరెదఁ జెప్పు మనిన నయ్యనసూయ యామె కిట్లనియె. 120

క. తల్లీ! నాయెడ నీ విట్టు
ల్లంబున సంతసించి యుత్సాహ సము

త఼్ుల్లము లగు చూపులతోఁ
జల్లఁగఁ గనుఁగొంటి వంతె చాలు న్నాకున్.

తే. కాని, నీతోడ మఱికొంత కాల మిట్టు
లిష్ట సల్లాప భంగి సంతుష్టిఁ గాఁగఁ
ద్వ న్ముఖాబ్జాత నిస్సర ద్వచన మధుర
మధు రసముఁ గ్రోలువేడ్క నా మదిని గలదు.

క. కావున నాయెడలఁ గృపా
భావమ్ముం బూని పరమ పాతివ్రత్య
శ్రీ విలసిల్లిన సతుల ప్ర
భావమ్ములు నుచితధర్మ భరితార్థములున్. 123

చ. వెలయఁగఁ గొన్ని నా కిపుడు
వీనుల విం దగునట్లు పల్క న
న్నలరఁగఁ జేయు మో జనని !
యంతియ కాక, త దుత్తమార్థ సం
కలితము లైన నీ నుడులు
కమ్మని కొండొక కావ్య బంధ మై
యిలఁ గల యాంధ్ర కామినుల
కిం పొనరింప ననుగ్రహింపవే. 124

చ. పరమ పతివ్రతామణుల
పావన వర్తన కీర్తనంబునన్
ధరఁ గల తోడియంగనలు
ధర్మ రహస్యములన్ గ్రహించి, సు
స్థిర తర కీర్తియున్ సుసుఖ
సిద్ధియుఁ జెంది నిరస్త కిల్బిషో
త్కరలయి సద్గతిం బడయఁ
గల్గుదు; రయ్యది చాలు నా కిఁకన్. 125

ఆ. అనిన నత్రిపత్ని, యా యనసూయప
ల్కులకు నెంతయేని యలరి నెమ్మ
నవ్వుఁ ధూటి మూఁపు నాత్మపావన హస్త
నీరజమునఁ గరుణ నిగుడ నిమిరి. 126

వ. అత్యంత వాత్సల్యంబుతో నామె కిట్లనియె. 127



శ్రీరస్తు.

# స్వ ప్నా న సూ యు.

## తృతీయాశ్వాసము.

క. వినుత తో త్తమ గుణ రంజిత
పతిహృదయా! సహజశుద్ధభావోదయ! సం
చిత పుణ్య నిచయ! వినయా
న్వితనయ! యనసూయ! దీని వినఁగదె తనయా!

చ. ఇతర సతీ హితైక హృద
యేప్సితవై యిపు డిట్లు నన్నుఁ గో
రితి; విది చాల లెస్స; సుచ
రిత్రి పవిత్రి! సతంబు నీ మనో
గతి యితరోపకార కృతి
కాంక్షఁ దనర్చుచు నుండుఁ గాదె? నీ
మతిఁ గల వాంఛితంబు సుగ
మంబ చుమీ పరమార్థ దర్శినీ!

క. ధరయందు "స్వయంతీర్ణులు"
పరులను దరియింపఁజేయఁ జాల్పుదురు; రటుల్
తరియించితి వీ, వన్యులఁ
దరియింపం జేయ నుంటి! ధన్యవు గదవే. 130

గీ. ఎంత ధన్యవు గాకున్న నిప్పటికిని
నీదుపతి త్వద్గుణాసక్తి నిశ్చలాను
రక్తియు నెసంగ నిన్నే నిరంతరంబుఁ
దలఁచికొనుచుఁ దపించునే తన మనమున? 131

క. పతి హృదయము నిజ సుగుణ
ప్రతతివలన డక్కఁగొని కరము నీవలె నం
చితగతి వర్తించిన స
త్సతియేగద యుభయలోకసౌఖ్యము లొందున్.

గీ. వెన్నపోలిక మృదుళమై వెలయు తనదు
హృదయ మేవేళ భర్తయందే లగించి
ప్రణయ రసమయమూర్తియై భర్త మనసు
గరఁచి కరఁగెడుకాంతయే కాంత పతికి. 133

క. కులమును రూపము విద్యయుఁ
గలిగిన మఱి యేమి సిరులు గలిగిన సుగుణం

బుల వలపించినగతి సతి
వలపింపఁగఁ జాల దాత్మవల్లభు నెపుడున్. 134

క. గుణవతియై నిర్వ్యాజ
ప్రణయంబున మెలఁగు ధర్మపత్నికిఁ జింతా
మణియై త ద్భర్త యను
క్షణమున్ బ్రణయైకతానకం బగుఁ దనయా! 135

క. తొల్లింటి నాఁటినుండియు
నెల్లెడ నవ్యాహతముగ నీధర్మంబే
చెల్లుట నే నెఱుఁగుదు నీ
ముల్లోకములందుఁ బ్రణయమూలం బగుచున్.

సీ. ఒనర నాఁగేటిచాలున నయోనిజ యయి
పొడమె నీబోటి యన్ బుద్ధిఁ గాదు !
జనక నామక మహాచక్రవర్తి కుమారి
యనియెడుగౌరవంబునను గాదు !
తులలేని త్రిభువనదుర్లభ సౌందర్య
విభవంబు గల దన్న వేడ్కఁ గాదు !
వివిధ విభ్రమ కళా విస్ఫురితా త్యద్భుత
చాతుర్యవతి యను ప్రీతిఁ గాదు !

తే. ప్రేమతత్త్వజ్ఞుఁ డైన శ్రీరామమూర్తి
సీతయెడ నట్టి కూరిమి నేఁత యరయ
ధర్మసతియంతరంగంబు మర్మ మెఱిఁగి
కాని, వేఱొండుకతమునఁ గాదుచూవె. 137

వ. అట్లగుటం జేసియ :— 138

ఉ. ఇష్ట చరిత్ర యైన హృద
యేశ్వరి నవ్వన భూమి నట్టు లా
దుష్టుఁడు రావణాసురుఁడు
దొంగిలి పోవఁగ రామచంద్రుఁ డీ
సృష్టి సమస్తముం బరవ
శీకృతమై తనతోడ శోకసం
ఘుష్టము గాఁగ దుఃఖమున
ఘూర్ణిలెఁ దత్ప్రియ ధర్మపత్నికై. 139

వ. ఇదియునుంగాక :—

సీ. అతిదుర్గమము లైన యడవులం బడరాని
బెడిదంపు టిడుములఁ గుడిచినాఁడు
సరి గాని వాని వానరరాజు సుగ్రీవుఁ
బ్రాణ మిత్త్రముగఁ జేపట్టినాఁడు

వెడఁదయై యేరికిం గడవ శక్యము గాని
కడలికిఁ బెనుగట్టు గట్టినాఁడు
పచ్చినెత్తురు దాగ్రివు పాపాత్ము లైన రా
క్షసులతోఁ జోరాట సలిపినాఁడు

తే. కేవలమ్ముగ లోకవిద్రావణుఁ డగు
రావణుని ఘోర సంగర రంగమందుఁ
దున్మి తూటాడినాఁడు! సద్గుణ విశిష్ట
శీల తన సీత యని తలంచియ కదమ్మ! 141

సీ. అడ్డు లే కొకపల్కు నాడింప లే దయ్యెఁ
బ్రాజ్యదైతేయ సామ్రాజ్యలక్ష్మి
కనుగోన నైనఁ గన్గొనఁ జేయ లే దయ్యె
భువన రమ్య కుబేర పుష్పకంబు
మాఱుమొగంబేని మరలింప లే దయ్యె
గంభీర దశకంఠ గౌరవంబు
ఒకపాటి తల నైన నూఁపింప లే దయ్యె
నతిరౌద్రి తర చంద్రహాసధార

తే. యద్దిరా! నిర్భర ప్రణయప్రఫుల్ల
రామచంద్ర పదాంభోజ రాగ భరిత

చరిత యగు సీత సౌశీల్య సద్గుణావళి
తాప మహిత పతివ్రతాత్వ ప్రశస్తి! 142

క. లోకాపవాద శంకా
వ్యాకులుఁడై ప్రాణభర్త యజ్ఞుఁడ పోలెన్
జేకొనక కానలో విడ
నేకాకిని యగుచు సీత యేమి యొనర్చెన్? 143

క. తన తల్లియైన భూదే
విని వేఁడ్కొని, యామె తనకు వివరం బిడఁ జ
య్యనఁ దద్గర్భంబునఁ జొ
చ్చె; నహో! పతిఁ జూడ మోము చెల్లక కాదే?

తే. అట్టి సీతామహాదేవి యనుపమాన
శీల సంపదయును, జన్మ సిద్ధ మహిత
మాన సంపత్తియును, లోక మానవీయ
మైన పతి భక్తియును దెల్ల మైనవె కద? 145

వ. అది యట్లుండె; వేఱొక్క వృత్తాంతంబుఁ జెప్పెద
నాలింపుము. 146

తే. తొల్లి యొకనాఁడు గోపికావల్లభుఁడును
సత్యభామయు విపినవాసమ్ము సేయు

పాండురాజాత్మజులను ద్రౌపదినిఁ జూడఁ
జనిరి వారున్న కాననంబునకు నంత. 147

వ. శ్రీకృష్ణదేవుండు తన యనుంగు మేనత్త కొమరు
లైన కౌంతేయులం గలిసికొని వారి యోగక్షేమ
సమాచారంబు లడిగి తెలిసికొని సంతోషంబుతో
నిష్టగోష్ఠి సేయుచున్న యవసరంబున నా శ్రీకృష్ణ
వల్లభ యగు సత్యభామయుఁ బాంచాలి కడ
కరిగి యామెచే నుచితవిధంబున గారవింపంబడి
కొంత తడ విష్టసల్లాపంబులం గడపి యేకతంబ
యొక్కయెడ నభీష్టకథాగోష్ఠిం బ్రవర్తిల్లుచుఁ
బదంపడి మేలంపుఁ జందంబున నప్పాండవ పత్ని
తో ని ట్లనియె. 148

క. ఏమమ్మా ! పాంచాలీ !
నీ మగ లేవురును సతము నీయెడ బద్ధ
ప్రేము లయి యొక్క తీరున
నే మెలఁగుచు వలచు చుందు రిది వింత గదా?

క. వీరులు ! పటు భుజబల వి
స్తారులు ! మానైకధనులు ! సాహసికులు ! నీ

వా రమణుల నేవుర నే
తీరున వలపింప నేర్చితివో నే నెఱుఁగన్. 150

౪. ఒకని కంటె నొక్కఁ డుపిద ! నీ కనురక్తుఁ
డై చరించు; వారి కరసి చూడ
నెపుడు నగు మొగంబులే కాని యెడ మొగం
బులును, బెడమొగములుఁ గలుగ వహహా!151

౫. పత్రిత మహిమంబా మంత్రబల
వైభవమో మహితౌషధీ సమ
ర్థతయొ యలంక్రియాతిచతు
రత్వమొ నూత్న విచిత్ర విభ్రమో
న్నతియొ మ ఱేదియో తెలియ;
నా కెఱిఁగింపఁ గదమ్మ నీవు నీ
పతులఁ ద్వదేక బద్ధ దృఢ
భావుల నెట్లొనరింప నేర్చితో. 152

౬. నీకడ నిజముగ భర్తృవ
శీకృతిఁ గావింపఁ జాలు చిత్ర క్రియ యే
దో కల దొక్కఁ; డట్టులె
కా కుండిన వార లింతగా వలతు రొకో ? 153

క. నావుడు ద్రుపదాత్మజ స
ద్భావము వెలయంగ నుచిత భాషణముల న
ద్దేవి కిటు లనియె ముఖ రా
జీవముపై నొక్క భంగిఁ జిఱునగ వొలయన్.

క. వనజోదర వల్లభ ! యో
వనితా రత్నమ ! వివేకవతి వగుదు గదా !
ననుఁ జెడిపల నడిగిన యను
వున నడిగితి! విట్టు లడుగఁ బోలునె నీకున్? 155

ఉ. మందుల మాఁకులం గుటిల
మార్గములం బతి వశ్యుఁ జేసికోఁ
గం దలపోయు చుండు పెఱ
కామినులన్ బలె నన్ను నెంచి యీ
చందము గాఁగ నీ వడుగఁ
జాఁగితివే ? కల్లనైన నట్టి యా
పొందుల కే నొడంబడెడు
బోటిని గాను జుమీ హరిప్రియా ! 156

క. యోషలు కొందఱు ధర్మవి
శేషజ్ఞులు గాక పతి వశీకృతి కై మం

త్రౌషధ ముఖ విధులం గొని
దోషం బొనరింతుర్తి తమ పతుల కజ్ఞతచేన్.

ఆ. ఎఱుఁగ నేర కాత్మ హితమునే మదిఁ గోరి
యా వెలఁదు లొనర్చు నట్టి క్రియలు
హిత మొనర్ప కుండుటే కాక వికటించి
తుదకుఁ దొలఁప రాని దోసఁగు సేయు.. 158

వ. కావున నే నట్టికుతంత్రంబుల నెన్నండును దడవం దలంప; ననవరతంబును భర్తృచిత్తానుసారిణి నై మదీయ ధర్మంబు నిర్వర్తించు కొనం బ్రియత్నించు చుండుదు; నది యెట్లనిన :— 159

సీ. భర్తృ దోషము లున్న భావింప మదిలోనఁ;
దత్కారణమునఁ గ్రోధము వహింపఁ;
గాఠిన్యమును నహంకారంబు నెన్నండుఁ
బూన; నెప్పుడు నొక్క పోల్కి గాఁగ
భక్తి సేయుదు; మనో వా క్కాయ కర్మంబు
లం దొకప్పుడు వింత చందములను
గాన్పింప; నెంతటి ఘనుఁ డైనఁ బర పూరు
షుని దృణంబుగ మనంబునఁ దలంతుఁ

తే. బతి హిత స్నాన భోజన పాన ముఖ్య
విధుల నాచేత నేన కావింతుఁ దదభి
మతముగా; నంతె కాని నే నితర జనముఁ
బంచి యూరక యుండ నప్పనులు సేయ. 160

ఆ. యుక్త వేళలందు యోగ్య మజ్జన భోజ
నాదికములు గూర్చి యనుదినంబుఁ
దనివి గొలిపి సంతతమును దత్సేవా స
మాదృతిన్ మెలంగ నభిలషింతు. 161

వ. ఇదియు నుం గాక- 162

చ. కలిమికి నీడుగాఁ దగిన
కైవడి బాంధవ లోకమున్ సుహృ
త్కులమును భృత్య వర్గ మును
దుష్టి వహింపఁ దదీయ వాంఛితం
బులు సమకూర్తు; దీనజన
పోషయు నర్థి సమర్చనంబు ని
చ్చలు నొనరింతు; సాధు జన
సమ్మతిగాఁ జరియింతు నెప్పుడున్. 163

క. గృహ భాండ స్థల శోధయు
బహువిధ భోజ్యాది వస్తు పరిశోధయు, న

న్వాహము నొనరింతు మోదా
వహముగఁబతిహృదయమునకువచ్చుతెఱఁగునన్

క. ఒక యెడ నేఁ బ్రోషిత భ
ర్తృక నగుచోఁ బుష్పగంధ దీ ప్తాభరణా
దికము ధరియింప నొల్లక
వికలత భర్త్రాగమంబె వేచుచు నుందున్. 165

వ. మఱియును, 166

తే. పతి వశీకృతి పడసిన పడఁతి నయ్యు
లేశ మేనియు నెపుడు నేలిదము చేసి
భర్తృచిత్తంబు గింకిరి పడఁ జరింప
నొదిఁగి వారల మది మెలంగుదును గాని. 167

క. ఈ విధమున నెల్లెడలన్
నా విభులను దైవములుగ నమ్మి సదా త
త్సేవాసక్తిఁ మెలఁగుట
చే వారును వలచి నాకుఁ జిక్కిరి వశులై. 168

ఆ. అంతె కాని ప్రాకృతాంగనలుం బోలె
బతుల వశులఁ జేయఁ బలుఁగుఁ బనులు
దడవ; మంత్రములును దంత్రముల్ మందులు
మాఁకులును గడించు మార్గ మరయ. 169

క. అని యిటు ద్రౌపది పలికిన
విని యెంతయు లజ్జపడుచు వెల వెల నగుచున్
వన జాక్షుని వల్లభ యి
ట్లనె వెండియు సానుతాప యై ద్రోవదితోన్.

క. ఓ పావన చారిత్రా!
నీ పాతి వ్రత్య ధర్మ నియతి నెఱుఁగ కే
నీ పగిది నిన్ను నడిగితి
నా పలుకులు నీవు లోఁ గొనం దగుఁ జుమ్మా.

ఆ. చనవు కలిమి వెడఁగుఁ దనమున నెఱుఁగమి
న నుచితముగ నాడి నట్టి నాదు
బేలనుడులు నవ్వులాటలుగా భావించి
సైఁప వలయు నో ప్రశస్త హృదయ! 172

వ. అని యిట్లా సత్యభామ తన తప్పు దా నెఱింగి
పశ్చాత్తాపంబు నొందుచు బహు విధంబులఁ
బాంచాలిం బ్రార్థింపఁ దొడంగుటయు నంత
నప్పాండవ పత్నియు నా శ్రీకృష్ణ వల్లభ యుల్లం
బు తెఱంగు దెల్లంబుగాఁ గనుంగొని, వెల్లఁబోవు
చున్న యా పల్లవపాణి నల్లన నూఱడింపం దలం
చుచుఁ జల్లఁ జల్లఁగా ని ట్లనియె. 173

క. అమ్మా ! నీ యడిగిన య
ర్థమ్మునఁ దలపోయ నంత తప్పేమియు లే
దిమ్మాడ్కి వేఁడ నేమిటి
కమ్మలిక వహించి యిట్లు లుల్లము కలఁగన్.

ఆ. ప్రాణ విభునిఁ బ్రణయ బద్ధుఁగా, వశ్యునిం
గా నొనర్చు కొనెడు కాంక్షఁ జేసి
యడిగి తీ వుపాయ; మంతియే కాని నీ
నుడుల నేమి దోసఁగు పొడమె నిపుడు ? 175

క. పరిహాస భంగి నేనుం
బరుసని ప్రత్యుత్తరంబు పలికితి నేమో
హరి వల్లభ ! నీవును మ
త్పరుషత సైరింప వలయుఁ బరమాదృతితోన్.

వ. అది యట్లుండె- 177

క. పతి వశ్యుఁ జేసి కొనఁ దగు
చతురోపాయంబు నీకు సముచిత ధర్మా
న్వితముగ నిహ పర సౌఖ్య
స్థితి కవిరుద్ధముగ నెఱుఁగఁ జెప్పెద వినుమీ.

ఉ. భర్త యొకండ దక్కఁ దలఁ
పం సతి కొండొక వేల్పు లేదు; స

ద్వర్తన మొప్ప నెల్లపుడుఁ
దత్పతి సేవ యొనర్చు కాంత కే
యార్తియు సంభవింపదు; య
థార్థముగాఁ దనుఁ గొల్చు భార్య కా
భర్తయు వశ్యుఁడై ప్రణయ
పాశ నిబద్ధుఁడు నౌఁ జుమీ సతీ! 179

క. పతి సంతసించినం గుల
సతి కైశ్వర్యంబు యశము సంతతియున్ స
ద్గతియు మహోత్తమ లోక
స్థితియుం జేకూర్చు నతఁడ చింతామణియై. 180

ఆ. కరముఁ గష్టపడినఁ గాని సౌఖ్యంబును
ధర్మ గతియుఁ బడయఁ దరము గాదు
సుఖము విడిచి భర్త్రు శుశ్రూష సలిపినఁ
గాని తత్ఫలంబు గలుగఁ బోదు. 181

క. కావున భర్తను సతతము
దైవతముగ నెంచి భక్తి తాత్పర్యములన్
సేవింపు మతఁడ నీ స
ద్భావ స్థితి యెఱిఁగి తాన వశుఁడై మరగున్.

వ. ఇదియ నీకుఁ బరమ సౌభాగ్యమూలం బైన పతి వశీకరణోపాయం; బింతకంటె నిహపరసాధకంబు, నిర్బాధకంబు, ననపాయంబు నైనయుపాయంబు వేఱొం డులే" దని చెప్పిన విని సత్యభామ యత్యంతసంప్రీతచేతస్కయై యిట్లనియె.

క. నీ వుత్తమ ధర్మజ్ఞవు
నీ వచనము లివియు ధర్మ నిశ్చితములు కృ
ష్ణా! వింటి; ముదముఁ గంటి; శు
భావహ మగు నుచిత మార్గ మరయం గంటిన్.

ఆ. అని ప్రియంబు మీఱ నయ్యాజ్ఞసేని న
క్కునఁ గదించి ముద్దుగొని సగౌర
వప్రపత్తిఁ గృష్ణవల్లభ యామె వీ
డ్కొని నిజేశుతోడఁ గూడి చనియె. 185



శ్రీరస్తు.

# స్వప్నానసూయ.

## చతుర్థాశ్వాసము.

క. ఓ వత్సా ! యనసూయా !
ద్రోవది శ్రీకృష్ణపత్నితో నొడివిన య
ప్పావనవచనంబులఁ గల
భావముఁదెలిసిన శుభమ్ముఁబడయుదురు సతుల్.

వ. మఱియు నిట్టి పాతివ్రత్యధర్మ బోధకంబు లైన విషయంబులు పురాతనంబులు నధునాతనంబులును భూలోకంబున ననేక పురాణేతిహాసాది గ్రంథంబులయందుఁ బ్రసిద్ధంబు లై యున్న యవియ. శ్రద్ధావతు లైనయువతుల కవి దుర్లభంబులు గావుగాదె యనిన నది విని యనసూయ భక్తివినయ వినిబద్ధాంజలియై మరల నయ్యత్రిపత్నితో నిట్లనియె.



శా. తల్లీ ! నాయెడ నెంతయేనియును వా
త్సల్యాతిరేకంబు శో

భిల్లన్ బల్కితి ధర్మసూక్ష్మ మిది సం
ప్రీతాత్మవై; నాకునుం
దెల్లం బయ్యె దదర్థ మంతయును; భ
క్తిన్ నీకుఁ గేల్మోడ్చి నా
యుల్లం బందు మఱొండు నిన్నడుగ ను
ద్యోగించితిన్ వెండియున్. 188

గీ. భగవతికిఁ గృత్యకార్యాతిపాత మెదియు
సంభవింపనిచో సుప్రసన్నభావ
మున నడుగ నాజ్ఞ యిచ్చి నామనసు తనియ
నుత్తర మొసంగ వేఁడుచు నున్నదాన. 189

గీ. అనిన ననసూయ యనసూయ కనియె వత్స!
యడుగఁ దలఁచిన దేదియో యడుగు మఱియు
నీకు వివరించి యత్రిమునిప్రవరుని
విధ్యనుష్ఠానవేళకు వెడలుదాన. 190

క. సందియ మేటికి నీయడు
గం దలఁచిన విషయ మదియుఁ గాంతాజనతా
నందకరంబే యై ధా
త్రిం దనరుఁ దదీయశుభతతికి మూలం బై. 191

వ. అని యిట్లయ్యత్రిపత్ని మహానుగ్రహంబున
ననుజ్ఞ యొసంగిన నయ్యనసూయ భయవినయ
బద్ధాంజలియై మరల నిట్లనియె. 192

తే. తనివి దీఱఁ బతివ్రతాధర్మసూక్ష్మ
గతి యెఱింగించితివి జగద్ధితముగాఁగ
నట్లె సత్పతివ్రతల మాహాత్మ్య సరణి
యును నొకింత వచింపుమో జనని! నాకు. 193

ఆ. పతుల దైవములుగ భావించి సేవించు
సతుల కెట్టి మహిమ సంభవించు
మహిఁ బతివ్రతాత్వ మహిమచే నెవ్వరే
పడయరాని ఫలము పడసి రమ్మ! 194

చ. అనవుడు నత్రిపత్ని ప్రియ
మారఁగ నో యనసూయ! సత్కులాం
గనకుఁ బతివ్రతాత్వమునఁ
గల్గని దేదియు లేదు; దేవతా
వనిజము భంగి సయ్యది శు
భప్రతిపాదకమై సుదుష్కరా
ర్థ నిచయ మైనఁ జాల సుక
రంబుగఁ జేయఁగఁ జాలు నొక్కెడన్. 195

వ. మఱియును :—

తే. కడవ శక్యంబుగాని యిక్కట్టులైనఁ
గడవఁ జేయును; దుర్లభకార్యమైన
సులభ మొనరించు; నిహపరసుఖముఁ గూర్చు
సాధనం బగు; నిది యసంశయము వత్స ! 197

వ. ఇందుల కుదాహరణంబుగా మదీయానుభవంబున నున్నయొకానొక వృత్తాంతంబు నీకెఱింగించెద నాలకింపుము. 198

చ. కడుకొను వేడ్కతోఁ గమల
గర్భుఁడు విష్ణువు నీశ్వరుండు నాఁ
బడెడుత్రిమూర్తులున్ గనక
పర్వత శృంగతలంబులం దొక
ప్పుడు విహరింపఁగాఁ దలఁచి
భూరిజవంబునఁ బొల్చు వారి త
త్తడులను బన్ని యంబర ప
థంబున నేఁగఁ దొడంగి రయ్యెడన్. 199

క. అతిజవమునఁ బఱచెడు న
ప్రతిహతగతు లాసరోజభవముఖమూర్తి

త్రితయోత్తమ వాహము ల
ద్భుతముగ నొకచోటఁ గదలఁబోవక నిలిచెన్.

వ. ఆసమయంబున-

గీ. ఆత్మవాహము లచ్చోట నట్టు లట్టె
నిలిచి ముందటి కరుగంగ నేరకున్నఁ
జూచి బ్రహ్మయు విష్ణుండు శూలధరుఁడుఁ
జిత్తములయందు మిగుల నచ్చెరువు గదుర. 202

క. ఈవాహము లేలొకొ యీ
తావున నిజ సహజ గమన దార్ఢ్యము లెడలం
గా వివశములై యెదుటికిఁ
బోవక యిక్కరణి నిలిచిపోయె నయారే! 203

క. అని వింతపడుచు నపు డ
వ్వనజాసనుఁ డాత్మ హంసవాహనముం జ
య్యన నెదుటికిఁ జన నదలిం
చిన నయ్యది చూచి చంద్రశేఖరుఁడు వెసన్.

ఆ. కేల నున్న తత్త్రిశూలాగ్రమున నిజ
వృషభవాహమునకు వెఱపు గొలిపి
యగ్రభూమి కరుగ నదలించెఁ గాని యా
యెద్దు కదల దయ్యె మొద్దు వోలె. 205

చ. అంతట విష్ణుమూర్తియుఁ బ్రి
యంబున నాత్మవాహయంబు నాగరు
త్మంతుని మూఁపుపై మిగుల
మార్దవరీతిఁ గరాంబుజంబునన్
సంతస మొప్పఁ దట్టుచుఁ భృ
శంబును లాలనఁ జేసి "యేల వి
భ్రాంతి వహించెనో యితఁడు
భావములోన నపూర్వవైఖరిన్ ? 206

క. ఒక యడుగేనియు ముం దిడు
టకుఁ గొంకుచు నుండె నక్కటా! యీ ఖగనా
యకునకు గమన నిరోధం
బొకఁడు గలదె యెన్నఁడేనియును నిక్కరణిన్."

క. అని చింతింపఁ దొడంగిన
వినతాతనయుండు వినయవిశదోక్తుల ని
ట్లని విన్నవించె నపు డ
వ్వనజాక్షునితోడ హరుఁడు బ్రహ్మయు వినఁగన్.

ఆ. దేవదేవ ! బ్రహ్మదేవుని మానస
పుత్త్రుఁడై తనర్చు నత్రిమౌని

పుంగవుని ప్రశాంత పుణ్యాశ్రమపదంబు
తనరు నిచటఁ గ్రింద ధాత్రియందు. 209

క. ఆపుణ్య తపోవనమున
నాపరమతపస్వివర్యుఁ డనుపమమహిమో
ద్దీపితయై తగు ననసూ
యా పతిదేవత భజింప నతిమహితుం డై. 210

తే. నిచ్చలుఁ దపించు చుండు; నా నియమశీలు
పుణ్యసతి యనసూయ త్రిభువన మాన
నీయ పరమాద్భుత చరిత్ర నిజపతివ్ర
తాత్వమహిమాధిగతదివ్యసత్త్వ దేవ ! 211

వ. అట్టియమ్మహాపతివ్రతాశిరోమణి యధివసించు పావనాశ్రమపదంబు వ్యతిక్రమించి పోవ బ్రహ్మ వాహనం బైన దివ్యహంసోత్తంసంబునకుఁగాని, మహేశ్వరవాహనం బైనవృషకులేశ్వరునకుంగాని, దేవరకు వాహనం బైయున్న నాకుఁగాని శక్యంబు గాని కర్జం; బది యట్లగుటంజేసి మే మింక ముందర నొక్కయడు గేనియు నిడ నేర; మను గ్రహింప వలయు నిది యింతియే గాక :- 212

క. మాకే యన నేమిటికో
లోకేశ్వరులార ! నిఖిలలోకాతీత
ప్రాకటమహిమాస్పద యగు
నాకులసతిఁ గడవ మీకు నది దుర్లభమే. 213

ఆ. ఏను సాహసించి యీరీతి పలికిన
పలుకులకు మఱొక్కభంగిఁ గాక
దేవదేవులార ! తిరిగి వత్తురుగాక
వెనుక కరుగ నాజ్ఞ నెట్టుఁ డిపుడు. 214

క. నా విని యావనజాక్షుఁడు
నావిశ్వవిధాత యామహాదేవుఁడున్
భావమ్ముల నతివిస్మయ
మావేశింపఁగఁ జనిరి నిజాలయములకున్. 125

వ. ఇట్లు చని, యయ్యనంతరంబున మరల నొం
డొక్కనాఁ డాత్రిమూర్తులు నేకీభవించి మదీయ
పాతివ్రత్యమహిమం బెంతపాటిదై యుండునో
యది పరిశీలింపం దలంచి నిజస్వరూపంబులతో
నస్మదాశ్రమపదోపకంఠంబున కరుగుదెంచుట
యు నాసమయంబున :— 216

ఆ. ఏను, నాదుభర్త యైన యతిమహాము
నీశ్వరుఁడును వారి నింత నంతఁ
గాంచి భక్తి నెదురుగాఁ బోయి సాష్టాంగ
వినతు లాచరించి వేడ్క మీఱ. 217

క. కొనివచ్చి యాశ్రమస్థల
మున సముచితపూజ్యపీఠముల నిల్పి ముదం
బున వారల కతిథి సమ
ర్చన మొనరించితిమి శాస్త్రసమ్మతవిధులన్.

వ. ఇవ్విధంబున మేమా సృష్టిస్థిత్యంత హేతుభూతు
లైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులఁ బ్రత్యక్షంబుగా
నర్చించి సముచితాతిథిసత్కారంబు లొనరించి
సంతుష్టాంతరంగులం గావించితి; మయ్యనంత
రంబున :— 219

ఉ. అక్షయభూరిదాన యజ
నాది సుకర్మలచేతఁగాక ప్ర
త్యక్షముగాని పంకజభ
వాచ్యుత శంకరు లిట్లు నేఁడు ప్ర
త్యక్షముగాఁగ వచ్చిరి గ
దా యను మోదము మిన్ను ముట్ట నే

సాక్షణమందె వారికి స
మస్తవిధాన్నములుఁ సమృద్ధిగాన్. 220

గీ. ఆయిత మొనర్చి వెచితి; నంతలోన
నామహాత్ముండు మద్భర్త యత్రిమునియు
నాత్రిమూర్తులఁ బ్రార్థించె నరుగుదెంచి
యభిమతాన్నంబు లెలమిమై నారగింప. 221

క. అపు డాత్రిమూర్తులును నా
దు పతిం గని యో నిరస్తదోషా! మునిలో
క పతీ! మముఁ బోవిడువుము
నెపపెట్టకు; మిచటఁ గుడువ నేరము నీతోన్.

తే. కలదు మాముువ్వురకు నొక్కకఠిననియమ
మనఘ! యభ్యవహారకర్మాదియందు
దాని నేటికి నీదుచెంత వచియింపఁ?
బోయి వత్తుము; నీవును బొమ్ము కుడువ. 223

క. మా నియమమునకు భంగము
గానీయనియెడల విగతకలుషుఁడ వగు నీ
తో నేము గలసి భోజన
పానాదికములను గొనుట భావ్యంబ యగున్.

వ. కాని, యిప్పు డిచ్చట నట్టి మా నియమంబు సెల్లుటయు సంభవంబు గానేర; దయ్యది సెల్లక మే మిందు విందు గుడుచుటయుఁ ఘటస్థింపం బోవదు; కావున నీవు వేఱొండు తెఱంగున భావింపకు మని పలుకుచు నామువ్వురుమూర్తులును గమనోద్యుక్తు లగుటయు నంత నాహ్లాదయేశ్వరుండును నేను నత్యంతాశ్చర్యోద్వేగ మగ్నమానసులమై వారిచరణసరోజాతంబులపై వ్రాలి :— 225

చ. కలి సిటు మీరు మువ్వురు న
కారణకారుణికత్వ మొప్ప నీ
స్థలమున కిట్లు వచ్చి కృత
సత్క్రియులై భుజియింపకుండ మ
మ్ములఁ జరితార్థభావమున
మోదమునం దనియింపకుండ ని
ష్ఫలముగ నేఁగుచో భువన
పాలకులార! తరింతు మే మెటుల్? 226

తే. అయితమైన పంచభక్ష్యాన్నములను
విడిచి మీ రిట్లు భోజనవేళఁ జనినఁ

బ్రితృవాయంబు మాకు సంభవముగాదె
యతిథిజన సత్క్రియా పరాయణులము గద ? 228

వ. అది యట్లుండె :—

క. మీా నియమం బది యెదియో
దాని నొకించుక వచింపఁ దగదే యది మా
చే నిర్వహింపఁ దగునది
యానేని కృతాభిమతుల మగుదుము గాదే ?

క. అని బహువిధములఁ బ్రార్థిం
చిన విని యపు డాత్రిలోకశిక్షాదక్షుల్
వనజాసన వనజోదర
వనజాంబకు లనిరి నాదు వల్లభుతోడన్. 230

చ. పరమమునీంద్ర ! నీవచన
భంగి యథార్థమ; యైననున్, దిగం
బర యగుసాధ్వి యన్నములు
భక్ష్యములుం గొనివచ్చి వడ్డనల్
నెరపనిచోట భుక్తిఁ గొన
నేరము మే మొకనాఁడు ; వింటె ? సు
స్థిరతరమైన మావ్రతము
తీ రిది నీ కెటు తీర్ప నయ్యెడున్ ? 231

మ. మదిఁ జింతించుచు నాదుభర్త పదయు
గ్మం బాత్మలో నెంతయున్
గుదురై యుండఁగ నిల్పి తన్మహిమ నా
కుం గల్ల భావించుచున్
సుదృఢారాధితదివ్యమంత్రజపసం
శుద్ధాక్షతల్ గొన్ని యా
త్రిదశాధీశులమీఁదఁ జల్లితిని బు
త్రీ ! యప్డు చిత్రంబుగాన్. 240

చ. అలలితాక్షతల్ హరిహ
రాజుల మేనులఁ దాఁకినంతనే
లాలిత దివ్యసుందర వి
లాసవిశేషము లొప్పమీఱ లే
బాలకు లౌచు నాభువన
పాలకు లయ్యెడఁ గానవచ్చి రో
బాలిక ! నాకు నచ్చెఱువు
పాటుదయించె మదిన్ ఘనంబుగాన్. 241

సీ. పాలసంద్రంబులోపల మఱ్ఱియాకుపైఁ
బవళించియుండు నప్పటి శిశుత్వ

పరిణతం బైన రూపంబుతో నిలసిన్ల
విష్ణుదేవుండు ; తద్విష్ణుమూర్తి
నాభీసరోరుహాంతర సంస్థిత మనోజ్ఞ
బాలాకృతిఁ దనర్చెఁ బన్మగర్భుఁ
డాయిర్వురకును నీడైన పిన్నతనంపు
పోయగంబునఁ బొల్చె శూలపాణి

తే. యిట్టు లామూవురును ముద్దుఁబట్టు లగుచు
మనము నలరింప నంత నేనును నిరస్త
సంశయాశయ నగుచు వస్త్రమ్ముఁ దొలఁగి
వచ్చి వడ్డనల్ సేసితి వారి కెల్ల. 242

వ. ఇవ్విధంబునఁ బ్రాకృతబాలకులపగిదిం జూపట్టు
చుఁ జిత్తరంజనం బొనరించుచున్నయావేల్పులు
ముగ్గురకును సమస్తసిద్ధాన్నంబులుం జయ్యన
వడ్డించి పోయి వెండియు మడుంగుఁజీరం గట్టు
కొని వచ్చి తదిచ్ఛానురూపంబుగా నప్పసి
వేల్పుల కాయన్నంబులు గడుపారఁ గుడువం
బెట్టి గాలుసేతులు గడిగి బొజ్జలు నిమురుచు
బుజ్జగించి సజ్జకం బైన కొండొక యూయల

సెజ్జపైఁ బండుకొనం బెట్టి జోలలం బాడుచు జోకొట్టుటయు. 243

క. నిండిన బొజ్జలతోఁ గను
పండువుగాఁ బవ్వళించి, పరదేవత లై
యుండెడు నవ్వసిపాప లు
ఖండసుఖాత్ము లయి నిదురఁ గని రచ్చోటన్.



శ్రీరస్తు.

# స్వ ప్నా న సూ యు.

## పంచమాశ్వాసము.

క. వింటివె యనసూయా! ము
క్కంటియు నలువయును దమ్మికంటియు నిటు మా
యింటఁ బసికూన లై పెఱ
కంటికిఁ గనరాక నిదుర గను టిది యెల్లన్. 245

క. ఇది యిట నిట్లుండఁగఁ దమ
హృదయేశుల జాడ సుంత యే నెన్నటికిన్
విదితంబు గాక యా శా
రదయు సిరియుఁ బార్వతియుఁ గరం బచ్చోటన్.

వ. అననుభూతపూర్వం బైన భర్తృవియోగ విషా
దాతిశయంబులం గాఁగుచు :— 247

ఉ. ఏయెడ కేఁగిరో త్రిభువ
నేశ్వరు! లెచ్చటఁ జిక్కినారో! యే

మాయల కందరాని మహి
మంబులఁ దారు స్వతంత్రు లై జగ
న్నాయకు లై స్వమాయ భువ
నప్రితతుల్ నడిపించు నద్భుతో
పాయులు వారి కేమిటి క
పాయము లేయవి సంభవించెనో? 248

క. ఇది చిత్రి, మిది యవేద్యం
బిది తలఁప నభూతపూర్వ మిది దుస్సహ మె
య్యది తెరువు దీని; కీయా
పద యెగతిఁ దొలఁగుఁ, జేయుపని యేదియుఁకన్.

తే. అనుచు నాలోకమాత లి ట్లటమటింపఁ
జొచ్చుటయు, నంత నింద్రాదిసురలుఁ గలఁగి
బ్రహ్మ విష్ణు మహేశు లిప్పగిదిగా న
దృశ్యు లై యున్న-చో నిఁక నెట్టులొక్కొ! 250

క. పొడమింపఁగఁ బోషింపఁగ
నడఁగింపఁగ నేర్చినట్టి యధినాయకు లా
యొడయండ్రు ముగురు లేకు
న్నెడ నీభువనప్రివృత్తి యేక్రియ నడచున్! 251

సీ. విధివిధానములకు వెరవేది ? యామ్నాయ
సముదయంబునకు నాస్కార మేది ?
సతతనిర్మితికిఁ గర్తృత యేది ? చిరసము
ద్ధత దుష్టదానవప్రతతి యేచి
కడుకొని రేఁగిన గతి యేది ? ప్రతినిమే
షపరిపాలనమున కుపథ యేది ?
వెస వృద్ధి గాకుండ విలయంబు గావింపఁ
బాల్పడఁజాలు నుపాయ మేది ?

ఆ. సృష్టికర్త లేక శ్రీవల్లభుఁడు లేక
యీశ్వరుండు లేక యేమి గలదు ?
కలది యెల్ల నల్లకల్లోలమై చేటు
నెందు ! నిప్పు డేమి సేయఁ గలదు ? 252

క. అని యనిమిషులును బద్మా
సనముఖదివిజాధినాథసతులును వగచే
మనములఁ దల్లడపడఁ జొ
చ్చిన నయ్యెడ గిరిజ తనదుచిత్తములోనన్. 253

తే. కొంత ధైర్యంబు నెట్టెటో గుదురుకొల్పి
యెల్లదివిజులు వినుచుండ నిట్టు లనియె

నాదిదేవతలైన పద్మాసనాది
దేవదేవులఁ గూర్చి యార్తిపడ నేల ? 254

క. త్రిజగదధినాయకు లమో
ఘ నిజు లజరామరులు; వారి నిర్వీర్యులఁ జే
సి జయింప నొంప మాయల
గజిబిజి గావింప మఱియొకరికి తర మౌనే? 255

తే. పరమకారుణికత్వ సంపత్తి కల్మిఁ
బాయ కొకవేళ దృఢభక్తిపాశబద్ధు
లగుచు నేభక్తవరహృదయముల నైనఁ
జిక్కియున్నార లేమొ వీక్షింపవలయు. 256

ఉ. నారదమౌనివల్లభుఁ డ
నారతమున్ ద్రిజగంబులందు సం
చారము సేయుచుండు సువి
చారమనస్కుఁ డతఁ డీసమా
చార మెఱుంగకుండఁడు వి
చారములన్ విడి యామహాత్మునిన్
గోరిన సర్వమున్ దెలిసి
కోనగు సంశయముల్ దొలంగఁగన్. 257

చ. అని గిరిరాజపుత్త్రి యిటు
లాడుచునుండ నిలింపు లాము చె
ప్పినయది యట్లులే యనుచుఁ
బెక్కు తెఱంగుల నన్నుతించుచుం
డ నచటి కేఁగుదెంచెను ద
టాలున నారదమౌనివల్లభుం
డును దనుఁ గాంచి యెల్లరుఁ గ
డుంగడు మోదముతోడ మ్రొక్కఁగన్.

వ. అట్లు నారదమహాముని యచ్చోటికి విచ్చేయు
టయు నంత :— 259

గీ. మాటలోననె నిర్జరమౌనివర్యుఁ
డేఁగుదెంచెను; మనచింత లేక దొలంగు
ననుచుఁ బార్వతియును వాణియును సిరియును
వేడ్క నాదేవముని గారవించి రపుడు. 260

క. నారదమౌనియు లక్ష్మీ
గౌరీవాణులకు భక్తిగౌరవములు పెం
పారఁగ సాష్టాంగనమ
స్కారము లొనరించి పొలుపుగా నిట్లనియెన్.

క. జననీమతల్లులారా !
కనుఁగొన మీ రిప్పు డేమి కారణముననో
మునుపటి యుత్సాహముతోఁ
గనరాకున్నారు నాదు కనుల కదేలా ? 262

ఆ. సర్వలోకములకు సంతోష సంస్థితుల్
దయ ననుగ్రహించు తల్లు లయ్యు
విన్నవోయి యిట్లు లున్నవా రిది యేమి?
మహితలార ! లోకమాతలార ! 263

చ. ననుఁ గనుఁగొన్నయంతనె మ
నంబులఁ గౌతుకసంభ్రమంబులన్
గనుటది మీకుఁ దొల్లియును
గల్గిన కూర్మియె; యైన నేఁడు నన్
గనెడు తెఱంగు వేఱె యొక
కైవడిగాఁ గనవచ్చె; నేకతం
బుననొ యనుగ్రహించి పరి
పూర్ణముగా వచియింప వేఁడెదన్. 264

క. నావలని ప్రయోజన మే
దో వలసి యిటున్నవారలో యేమొ కృపా

భావమున నాన తీయం
గా వలయున్ సంశయింపఁగాఁ బని గలదే? 265

ఉ. నావుడు వార లిట్లనిరి
నారద! యేమని చెప్పుమందు వ
య్యా! విను మాత్రిమూర్తులును
నద్భుతభంగి నదృశ్యు లైరి వా
రేవల నుండిరో తెలియ
దించుక యేనిఁ దదీయవార్త; మా
భావము లీమెడాటమునఁ
బల్లటిలం దొడఁగెన్ గుమారకా! 266

క. ఎఱుఁగవె? మును మము వారొక
యఱనిముసంబేని విడిచిరా యెపుడేనిన్?
గర మచ్చెరు విది యిపు డి
త్తెఱఁగున మము విడిచి యేగతిం జనినారో?

క. లోకత్రియసంచారివి
నీ కెఱుఁగన్ రాక యుండ నేర దొకండున్
త్రైకాలికవిజ్ఞాన వి
వేకనిధీ! వారిజాడ వినరాదు గదా? 268

ఆ. అనుచు వారలిట్లు లజ్జకామినుల చం
దమునఁ బలుక దివ్యతాపసుండు
నబ్బురమ్ము వడుచు నయ్యాదిమాంగనా
తిలకముల యవస్థఁ దెలిసి వగచి. 269

వ. ఒకించుకతడవు వినిర్మలైకాగ్రచిత్తంబున నాలో
కించి నిజదివ్యజ్ఞానబలంబునంగాని, యాత్మయోగ
సమాధి పరిభావంబునంగాని యప్పురాణపూరు
షుల యథార్థస్థితిగతు లవగతంబులు చేసికొన
నేరక వెండియు నా శ్రీవాణీ గిరిజలతో నిట్లనియె.

తే. తల్లులారా! యిదేమి చిత్రము! యెఱుంగ
రాక యున్నది యాజగద్రక్షకుల ప్ర
వృత్తి యొక్కింతయేని మచ్చిత్తమునకుఁ
దీక్ష్ణతరమైన నాదివ్యదృష్టిఁ బడక! 271

వ. అది యట్లుండె, నే నొకించుక కాలంబుక్రిందట
మధ్యమలోకమ్మునం గుమ్మరుచు నొక్క
నాఁడు మహాతపస్సంపన్నుండైన యత్రిమహర్షి
యాశ్రమపదంబున కరిగి యచ్చట:— 272

ఆ. అమ్మహాతపోధనాగ్రేసరుని ధర్మ
పత్ని బహుతపఃపరిభావమహిత

పి్రియముమీఱఁ బెంపఁ బెరుఁగుచున్న కుమార
కులను మూవురఁ గనుఁగొంటి నపుడు. 273

క. జనయిత్రులార ! తేజః
ఖనులై దేదీప్యమాన కాయంబులతోఁ
దనరారెడు నానిసుఁగులఁ
గనిసంతసె నాకుఁ బరమకౌతుక మొదవెన్. 274

ఉ. వారల రూపసంపదయు
వారి యమానుష దివ్యతేజముల్
వారల భాగ్యచిహ్నములు
వారి వినూత్న విలాసలక్ష్మిఁ గ
న్నారఁగఁ జూచి చూచి కడు
నబ్బుర మందుచు "నీ నిసుంగు లె
వ్వారొకో యాతి్రమూర్తులయు
వైభవముల్ గనుపట్టు వీరికిన్. 275

గీ. హరి హర హిరణ్యగర్భుల యంశములను
బొడమినారలొ యీచిన్ని బుడుత లిమ్మ
హాతపస్విని కనసూయ కాత్మజు లయి
కాక యీలోకజుల కిట్టి కళలు గలవె ?" 276

వ. అని యొకింత చింతించి. 277

క. వీరలు మానవ శిశువులు
గాఁ; రెవ్వరో యనుచు నాత్మగతముగఁ దలఁపన్
ప్రారంభించితి నో యమ
లారా ! సంశయతరంగితాత్మఁడ నగుచున్.

క. అప్పటి మదీయ సంశయ
మిప్పటికిఁ దొలంగె నిచటి యీచో ప్పరయన్
తప్పదు వారు త్రిమూర్తులె;
యెప్పగిదినో యట్టు లయ్యె రేమనవచ్చున్. 279

వ. అని యిట్లు పలికిన యద్దేవముని వచనంబుల నవ
ధరించి హరి హర విరించి సతులు తమ పతుల
యుదంతం బింతయేనియుం దెలియవచ్చినందుల
కెంతయు సంతసించి యమ్మఱునాఁడు వేకువ
నాకాశమార్గంబున నారదపురస్సరంబుగా భూలో
కంబున కరుగుదెంచి యస్మత్తపోవనపరిసరంబుఁ
జేరవచ్చుటయు నాసమయంబున :— 280

సీ. ఏను నాభర్తయు నెదురేఁగి యతిభక్తి
నాలోకమాతల నర్ఘ్యభంగిఁ

గొని తెచ్చి నారదముని సమేతంబుగా
వారికి సకలోపచారవిధులు
వెలయ సపర్యలు సలిపి తత్పాదాంబు
జములకు మ్రొక్కి యంజలి ఘటించి
“ యనుపమానుగ్రహంబున నస్మదాశ్రమ
పదమున కేప్పు డిప్పగిది మీర
గీ. లరుగుదేఱఁ గతం బేమి యంబలార !
యానతీఁ దగు ” నంచు మే మర్థి వేఁడ
సుప్రసన్నాంతరంగులై చూచి వార
లెసక మెసఁగంగ నాతోడ నిట్టు లనిరి. 281

క. చిరకాల మయ్యె నోముని
వరకామిని ! మాదు ప్రాణవల్లభు లెందో
యరిగి, మఱి తిరిగి రాకుం
డిరి మాహృదయముల వగపు డెప్పర మయ్యెన్.

ఆ. పతివియోగదుఃఖ పరితాపమునఁ గ్రాఁగు
మా యవస్థ యెల్ల మది నెఱింగి
యీ నిలింపమాని యెఱిఁగించె నీకడ
ముగురు చిన్నిపాపలు గల రనుచు. 283

క. వారలు త్రిమూర్తి సదృశా
కారముల నమానుష ప్రకారములం జె
న్నారుచు నున్నారఁట యె
వ్వా రాబాలకులు పుణ్యవతి! తెలుపఁ గదే? 284

ఉ. నారదమౌని భవ్యవచ
నంబుల మాహృదయంబు లెట్టిటో
యూఱటఁ గొంత సెందఁ దుద
కోమహితాశయ! యిట్లు వచ్చి యు
న్నారము మీ శుభాశ్రమ వ
నంబున కీయెడ నీవు మాయెడన్
గారవ మొప్ప నమ్మగురు
కంచులఁ జూపఁ గదమ్మ వేడ్కతోన్. 285

క. ఆ పసిపాపలు మూగురు
మా పతులైయుందు రనెడు మతి వాడముట ని
న్నీపగిది వేడవలసె మ
హాపాతివ్రత్యనిలయమా! యనసూయా! 286

వ. ఇదియునుం గాక :— 287

ఉ. చెల్లని కర్జ మే మయినఁ
జేసినవారలొ యేమొ నీకు మా

వల్లభు; లట్టులే యయిన
వారల తప్పది వేగ సైఁచి మో
తల్లి ! పతివ్రతాజనమ
తల్లి ! మముం దిలకించివేని మా
యుల్లము చల్లఁగా నొసఁగు
మోరిమితోఁ బతిభిక్ష మాకిటన్. 288

క. అనవుడు వారల దీనతఁ
గని నే నెంతయును జాలిఁ గని, యోత్రిజగ
జ్జననీమతల్లులారా !
వినుఁడీ మీపతులు విశ్వవిభుతోపేతుల్! 289

క. మాయాతీతులు వారే
మాయలఁ జిక్కుదురు భక్తమానస వికస
త్తోయజములఁ దక్క ? గతా
పాయులు వా రొక్కకీడుఁ బడయుదు రొక్కో? 290

గీ. పరుల రక్షింపఁ బ్రాపగు పరమపురుషు
లన్యు లెవ్వారలను నెగ్గు నాచరింప
రా త్రిమూర్తులు నస్మదీయ ప్రభూత
తరతపోధీనులై యుండె వలలు చుండ్రి. 291

చ. పరమకృపానుషక్తిఁ బసి
పాపల రూపులు గాంచి మాకు భా
సురగతి ముద్దు ముచ్చటలు
చూపుచుఁ దీయని తొక్కుఁబల్కుఁలన్
బరఁగ సతంబు మాచెవుల
పండువు సేయుచు సంతతోత్సవో
త్కరముగ నస్మదాశ్రమ ప
దంబున నుండ్రి ముదంబు మీఱఁగన్. 292

ఉ. పావన మయ్యె మీచరణ
పంకజ పుణ్య పరాగ యుక్తిచే
నీవన మెల్ల; మీ కరుణ
నేముఁ గృతార్థుల మైతి; మంబలా
రా! నెలయంగ మాతపము
లన్నియు నిట్లు ఫలించె; "వీరలే
మీవరు" లంచు నామిసిమి
మేనుల కూనలఁ దెచ్చి చూపితిన్. 293

గీ. అంత, వారలఁ గాంచి యొక్కింత చింతఁ
దక్కి యాలోకమాత "లో తల్లి! మాదు

వల్లభులు నీ పతివ్రతాత్వ మహిమమున
నీ శిశుతఁ బాయఁగ ననుగ్రహింపఁ గదవె. 294

సీ. అని వేఁడుకొనుటయు నంత, నేను మదీయ
వల్లభు నానతి వడసి వచ్చి
మంత్రపూతాక్షతల్ మరల వారలమీఁదఁ
జల్లితి; నప్పు డాక్షణమునందె
సకలలోకంబులు సంతోషముం బొంద
శ్రీ వాగ్భవాను లచ్చెరువు సెందఁ
బేరక నయన సంప్రీతిగాఁ దొల్లింటి
భంగి నిజస్వరూప ధరు లగుచుఁ

గీ. బద్మలోచన పద్మసంభవ మహేశు
లెదుటఁ బ్రత్యక్ష మై రంత నేను నేఁగి
వేగ మత్పతిపాదారవిందములకు
నెలమిఁ బ్రణమిల్లి యతనితో నిట్టు లంటి. 295

గీ. ఓ మనోవల్లభా ! తపోయోగనిష్ఠ
నెవరి దర్శింపఁ దలఁతుమో యెల్లవేళ
నట్టి యాదేవతాధ్యక్షు లాత్మసతులఁ
గూడి యిందున్న వా; రదే చూడు మనఘ !

క. వారల సృష్టి స్థితి సం
హార విహారుల సునిగ్రహానుగ్రహా దు
ర్వారుల దర్శించి తపః
పారంగతుల మగు టిపుడు భావ్యంబుగదా! 297

గీ. అనిన నమ్మహర్షి హర్షసంపులకిత
గాత్రుఁ డగుచుఁ దపముఁ గట్టిపెట్టి
నన్ను వెంటఁ గొనుచుఁ గ్రిన్న సద్దేవత
లున్నయెడకు భక్తియుక్తి వచ్చి. 298

వ. కృతాంజలియై యిట్లనియె:—

శా. ఓ వేదత్రియమూర్తులార ! నిజస
త్త్వోదాత్తులారా ! సుధీ
భావాతీతమహాత్త్వలార ! గిరిజా
వాణీ రమానాథులా
రా ! విశ్వాత్మకులార ! యేనును మదీ
యశ్రేయసీ రత్నమున్
మీవాత్సల్య విశేషపాత్రులము నె
మ్మి న్నమ్ము రక్షింపరే ! 300

ఉ. మీగుణరూపసంపదలు
మే మనురూపముగా గ్రహించి యే

లాగున మీపదాంబుజము
లన్ భజియించి తరింప వచ్చునో
యాగులు తేమి యే నెఱుఁగ;
మైన సమాశ్రితరక్షణైక దీ
క్షా గరిమంబు గల్గుటన
కాదె కృపక్షా జనుదెంచినా రిటుల్. 301

క. నేరని వారము, కరుణా
పారీణుల్ ! మిమ్ముఁ గాంచి కడు ధన్యతఁ గ
న్నారము సంసారమ్మ స
సారముగా, మనసు నిర్విచారము గాఁగన్. 302

ఆ. మ మ్మనుగ్రహించి మాయపరాధముల్
సైఁచి మాతపములు సఫలములుగఁ
బ్రోవుఁ డో పురాణపూరుషులార ! మీ
సతులు మీరు సుప్రసన్ను లగుచు. 303

వ. అని మద్వల్లభుం డిట్లనేకవిధంబులం బ్రార్థింప నత్యంతానుగ్రహాయత్తచిత్తులై యప్పరమపురుషులు న న్నవలోకించి :— 304

క. ఓ పుణ్యసతీ రత్నమ !
నీపాతివ్రత్యమహిమ నిరుపమ మన్మ

త్యాపత్యము సైరింపుము
కోపం బెఱుఁగని పవిత్రకులసతివిగదా ! 305

క. నిను వంచింపఁ దలఁచి వ
చ్చిన మాకే వంచనమ్ము చేకుఱెఁ బుణ్యాం
గనల కనిష్టముఁ దలఁచిన
జనుల యభీష్టంబు లేల సమకుఱు నమ్మా! 306

ఆ. ఏము నీపవిత్రభావ మెఱుఁగంగఁ దమకించి
కానిపనికిఁ బంచి కాంచినార
మనఘచరిత ! నీమహత్త్వంబు మ మ్మిట్లు
చిన్నఁబుచ్చె ; నేమి సెప్పవలయు. 307

క. పాతివ్రత్యమహత్త్వము
చేతఁ ద్రిమూర్తులను గొఱఁతఁజెందించితి నీ
ఖ్యాతి సమస్తయుగంబుల
భూతలమున సుస్థిరముగఁ బొలుచుచునుండున్.

సీ. పరికింప మొందు నీవంటి యుత్తమసాధ్వి
నేలోకమునను; ని న్నిట్టి సతిని
బత్నిగాఁ బడసిన బ్రహ్మణ్యుఁ డీయత్రి
మునిపుంగవుఁడు దేవవినుతుఁ డయ్యెఁ

బతు లిట్టిసతులను బడసికదా యుర్వి
ధన్యులై పుణ్యసంతతులఁ గనుట ?
యత్యంతపావనం బైన మీదాంపత్య
మఖిలలోకస్తుత్యమై తనర్చె

గీ. మిగులఁ దడవులనుండియు మీ రొనర్చు
తపములు సపర్యలును మమ్ముఁ దనిపెఁ జాల
మెచ్చు గలిగె నముగుఁడు మీ యిచ్చవచ్చు
వర మొకం డేదియే నిడువార మిపుడె. 309

క. ఓ పుణ్యసతీపతులా
రా ! పరమతపోగరిష్ఠులారా ! మీ వాం
ఛాపరిపూర్తి యొనర్చుట
మాపని; మీ ధర్మనిష్ఠమాన్యంబుగదా? 310

ఆ. అనిన మేము వారి కంజలి ఘటియించి
" దేవదేవులార ! కేవలమ్ము
విశ్వవిభులు మిమ్ము వేడ్కతో దర్శించు
కంటె నితర మేమి కావలయును? 311

చ. అయినను, మీర లిట్టులు కృ
పాతి వశంవద చిత్తవృత్తి మా

పయిఁ దులకింపఁజేసి నిజ
భక్తుల మమ్ము నభీష్టదాన ని
శ్చయత ననుగ్రహించుట న
సంశయభావులమై జగత్త్రయీ
శ్రియులగు మిమ్ము మే మొక వ
రం బడుగం దలకొంటి మియ్యెడన్. 312

వ. అది యెట్లనిన :— 313

క. చిరకాలము మీ రిచ్చటఁ
బరమానందముగ బాలభావముతో మా
కురుమోదముఁ గూర్చితి ; రే
కరణి న్మిము వీడి యుండఁగలవార మిఁకన్? 314

క. కావున మాయెడలఁ గృపా
భావముతో మిమ్మువంటి పసి నిసుఁగుల మా
కీ వేఁడుచున్నవారము
దైవతవిభులార ! మమ్ముఁ దనుపుఁడు వేడ్కన్.

సీ. అని యిట్లు భక్తి మే మర్థింప నా త్రిమూ
ర్తులును బ్రసన్నచిత్తులయి నాదు
గర్భంబునం దాత్మకళలతోఁ దనయులై
యుద్భవింపఁగ వరం బొసఁగి; రంత

శ్రీ దేవియును బార్వతీదేవియును భార
తీదేవియును గృపాధీన లగుచు
సకలశుభమ్ములు, సౌభాగ్యమును సౌఖ్య
సంపదలును నాకుఁ బెంపుసెందఁ

గీ. జిరము వర్థిల్ల వేడ్క నాశీర్వదించి
గారవించిరి; పిదపఁ దత్కమలజాది
దైవతాధీశ్వరులు నిజధామములకుఁ
జనిరి తమతమ దేవేరు లనుగమింప. 316

క. ఓవత్సా! యనసూయా!
యీవృత్తాంతంబు నెల్ల నీవహితవై
భావించి వింటి; వేత
ద్భావంబును నీకుఁ దేటపడియుండుఁగదా? 317

సీ. గరుడముఖ్యులకు వేగ నిరోధ మొదవుట
మహిత పాతివ్రత్య మహిమఁగాదె?
హరిహరాజులకు బాల్యావస్థ యొదవుట
మహిత పాతివ్రత్య మహిమఁగాదె?
దేవతలకు దివ్యదృష్టి లోపించుట
మహిత పాతివ్రత్య మహిమఁగాదె?

శ్రీ వాగ్భవానులచే దీవనలుగొంట
మహిత పాతివ్రత్య మహిమఁగాదె?

గీ. మహితమైన పాతివ్రత్యమహిమ నింక
వేఱ వచియింపనేటికి విస్తరించి?
మానవతికిఁ బాతివ్రత్య మహిమవలనఁ
బడయరాని దొకండు నెయ్యెడల లేదు. 318

క. అనసూయా నీ వర్థిం
చిన యర్థములెల్లఁ దెలియఁజెప్పితి నీ కో
రిన వడువున నాంధ్రసతీ
జనహితము ఘటిల్లు నిది నిజంబు కుమారీ. 319

క. ఈ మనసంభాషణములు
నామహిమమువలన ధాత్రినవకావ్యరస
శ్రీ మెఱయుచున్నయవి కాం
తామణి! యవి యభిమతార్థదములగు నీకున్.

సీ. నీభర్త సుకవివర్ణిత చరిత్రుండౌచు
సకల సంపదల నిచ్చలు సుఖించు
నీపుత్త్రి సద్గుణాన్విత యౌచు సౌభాగ్య
సంపదల్ వెలయఁ బ్రశస్తిఁ గాంచు

నీయన్న నృపమాననీయుఁడై నిజపత్ని
తో సంపదలఁ దులఁదూఁగుచుండు
నీమఱంది సుధర్మనిష్ఠుఁడై నిరతంబు
శుభ పరంపరల మెచ్చుఁ గనుచుండు

గీ. నీదు బంధుగు లెల్లరు నిజమనోర
థములు ఫలియింప సుఖు లయి తనరుచుండ్రి
నీచరితము త్రిలింగమానినుల కెల్ల
నీతిబోధక మయి భువి నిల్చుఁ జిరము. 321

ఉ. మిక్కిలి ధన్య వీ వయితి
మింటికి మంటికి వన్నెఁదెచ్చి నీ
చక్కని కీర్తి నీవు నిఁక
శాశ్వతమోదముతోడ నిందె యా
చుక్కలలోనఁ జుక్క వగు
చున్ విలసిల్లుచు నుందు వుజ్జ్వల
దృక్కమనీయవై యరుగు
దున్ మఱి నే నిఁక నో కుమారికా! 322

క. అనిచెప్పి యత్రిసతి చ
య్యన నంతర్ధాన మొందె నాక్షణమందే

యనసూయయు నాకనులకుఁ
గనఁబడరాదయ్యె నంత గగనస్థలిపై. 323

క. మిలమిలకాంతులు సలువం
కల నిగుడఁగ వజ్రగోళకంబుల రీతిన్
విలసిలఁ గనుఁగొంటిన్ జు
క్కల రెంటిన్ బిదప మేలుకంటి న్నేనున్. 324

క. మేలుకొని యుతచి వాగ్ఝరి
చాలుకొనన్ భారతీప్రసాదంబున నీ
లీలన్ గబ్బముఁ గూరుపఁ
జాలితి నారాయణేష్ట సంపూర్తికిఁగాన్. 325

స్వప్నానసూయ సత్వము

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

